ఆంధ్రప్రదేశ్‌లో

# ద్వితీయ ప్రణాళిక - ఆచరణ

రచన:
జి. ఎల్లమందారెడ్డి

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2

# ఆంధ్రప్రదేశ్ లో
# ద్వితీయ ప్రణాళిక - ఆచరణ

జి. ఎల్లమందారెడ్డి
ప్రతిపక్ష ఉపనాయకులు,
ఆంధ్రప్రదేశ్ శాసనసభ

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ-2.

# ముందుమాట

ఇలాంటి పుస్తకాన్ని వ్రాయటం చాలా కష్టతరమైన పని. వివిధశాఖలకు సంబంధించిన వివరాలు సేకరించటము, అవసరమయిన లెఖ్ఖలు తయారు చేయటము చాలా శ్రమతో కూడిన పని.

ద్వితీయ ప్రణాళిక త్వరలో ముగియబోతున్నది. తృతీయ ప్రణాళిక ప్రారంభము కాబోతున్న ఈ సమయములో మన రాష్ట్రములో ప్రణాళిక ఏ విధంగా అమలు జరిగినది, ఆశించిన ఆశయాలు సాధించబడ్డాయా, అయితే ఎంతవరకూ అన్న విషయాన్ని ప్రతీ ఒక్కరూ శ్రద్ధగా పరిశీలించాల్సిన అవసరమున్నదని వేరే చెప్పనక్కరలేదు.

ఈ పుస్తకములో ముఖ్యమయిన అభివృద్ధి కార్యక్రమాలకు సంబంధించిన విషయాలు చర్చించబడ్డాయి. ఈ విషయాలకు మన అనుభవాలు జోడించి సమస్యలను పరిశీలించినపుడే సరిగా అర్థము చేసుకోటానికి అవకాశమేర్పడుతుంది.

ఇందుకు కావలసిన సమాచారమును, అంకెలను సాధ్యమయినంత త్వరలో అందించి సహకారము చేసిన వారికి నా కృతజ్ఞత.

ఈ పుస్తకము వ్రాయుటలో మొదటినుంచీ అన్నివిధాలా పూర్తి సహాయముచేసి తోడ్పడిన శ్రీ కె. యల్. నరసింహారావుగారికి (చీఫ్‌విప్ లెజిస్లేచర్ కమ్యూనిస్టు అండ్ డెమోక్రాట్స్ ఫ్రంట్), శ్రీ యన్. వి. భాస్కరరావుగారికి (కార్యదర్శి, లెజిస్లేచరు పార్టీ ఆఫీసు) నా కృతజ్ఞత. మరియు ప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు కార్యదర్శి శ్రీ తోట సత్యనారాయణ, లైబ్రేరియన్ శ్రీ టి. వి. ఆచారి గార్ల సహాయమునకు నా కృతజ్ఞత.

— రచయిత



# 1. భారతదేశంలో ద్వితీయ ప్రణాళిక

పదమూడేండ్లు దాటింది, స్వరాజ్యంవచ్చి. బ్రిటిష్ సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా మన దేశంలో లక్షలాది ప్రజలు పోరాడారు. వేలకొలది తమ ప్రాణాలనుసైతం త్యాగంచేశారు. మన దేశము సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజం, జమీందారీ విధానములచే తరతరా లుగా దోపిడీ చేయబడింది. స్వరాజ్యమంటే, తరతరాలనుండి దోపిడీ చేయబడిన పీడిత ప్రజలు, కూలీరైతు ప్రజాసామాన్యం దోపిడీనుంచి విముక్తి గావటం. స్వరాజ్యమంటే ఆకలి, అంటురోగాలు, దారిద్ర్యము, అజ్ఞానము అంతము చెయటం. ఆనందదాయకమైన, అభివృద్ధికర మైన, మనిషిని మనిషి దోపిడీచేయని ప్రజాస్వామిక రాజ్యాన్ని నిర్మిం చటం. ఇదే ప్రజా సామాన్యముయొక్క వాంఛ.

వందల సంవత్సరాలు సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంచే దోపిడీ చేయబడిన, వెనుకబడ్డ ఆర్థిక విధానముగల దేశాలు త్వరితగతిని అభి వృద్ధి కావాలంటే, ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానము కావాలి.

అందుచేతనే మనదేశములో మొదటి పంచవర్షప్రణాళిక అమలు జరిగింది. రెండవ పంచవర్షప్రణాళిక ప్రారంభించి నాలుగు సంవత్స రాలైంది. ఇంకొక్క సంవత్సరంలో పూర్తికానున్నది.

ద్వితీయ పంచవర్షప్రణాళిక ఆశయము లేవి? అవి ఎంతవరకు అమలు జరిగాయి—అనే విషయాన్ని పరిశీలిద్దాము.

ద్వితీయ పంచవర్షప్రణాళిక ఉపోద్ఘాతములో ఈవిధంగాఉంది :

"భారతదేశ గ్రామీణ ప్రాంతముల పునర్నిర్మాణమునకు, పారి శ్రామిక పురోగమనమునకు తగిన పునాది వేయుట; మన ప్రజలలో

ఆర్థికంగా ఏ అవకాశాలూ లేక వెనుకబడియున్న వర్గాలకు సాధ్యమైనంత అత్యధిక అవకాశాలను కల్గించుట; దేశంలో అన్ని ప్రాంతాలకు సమానమైన అభివృద్ధిని సాధించుట." ఇదీ ద్వితీయ ప్రణాళిక ఆశయము.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక దిగువ లక్ష్యాలతో రూపొందించబడినది:

1. ప్రజల జీవన ప్రమాణములను పెంపొందింపజేయుటకు జాతీయాదాయమునందు తగినంత పెరుగుదల సాధించుట.
2. కీలక, భారీ పరిశ్రమల స్థాపనకు ప్రత్యేక ప్రాధాన్యమిస్తూ, సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించుట.
3. ఉద్యోగావకాశములను బహుళంగా కల్పించుట.
4. ప్రజల ఆదాయము, సంపదలందుగల వ్యత్యాసములను తగ్గించి, ఆర్థికశక్తిని సమానముగా పంచిపెట్టుట.

ఈ లక్ష్యములన్నీ ఒకదాని కొకటి సంబంధము కలిగియున్నవి. కాబట్టి వీని సాధనకు సమగ్రమైన విధానములను అనుసరించవలసియున్నది." (ద్వితీయ పంచవర్ష ప్రణాళిక : పేజీ 24)

ద్వితీయ ప్రణాళికలో నిర్వచించిన యీ ప్రధాన ఆశయాలు భారతదేశంలో బహుజనాభిప్రాయానికి అనుగుణ్యమైనవే. అనేక సంవత్సరాలనుండి దోపిడీ చేయబడి, జాతీయ పునర్నిర్మాణముకొరకు తహతహలాడుచున్న కోట్లాదిప్రజలు ప్రణాళికయొక్క యీ ఆశయాలను ఆహ్వానించారు. ఇవి ఆచరణలోకి వస్తాయని ఆశించారు.

కాని నిజంగా మన ద్వితీయ ప్రణాళిక ఈ ఆశయాలకు అనుగుణ్యముగా రూపొందించబడిందా? ఈ ఆశయాలను అమలు పరచుటకు కాంగ్రెసు ప్రభుత్వాలు ఎంతవరకు కృషిచేశాయి? అనే విషయాలు ప్రణాళిక నాలుగు సంవత్సరాలు అమలు జరుపబడి, మరొక 5 మాసాలలో ముగియబోతున్నప్పుడు వివిధరంగాలలో ఇంత వరకు జరిగిన కృషిని విమర్శనాత్మకంగా సమీక్ష చేసుకున్నప్పుడు బోధపడగలదు. మనకున్న సహజ సంపదను సరిగా వినియోగించుకొనుటకు, త్వరితగతిని అభివృద్ధిని సాధించుటకు పెద్దపెద్ద ప్రణాళికలు

అవసరము. అలాఅయితేనే నిజమైన అభివృద్ధిని సాధించగలము. మనకున్న అపారమైన సహజ సంపదను, జన బలమును ఉపయోగించుకోవాలంటే, మనకున్న వనరులన్నిటినీ సరైన పద్ధతిలో సమీకరించుకోగలగాలి. కాని ద్వితీయ ప్రణాళికక్రింద కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలచే తలపెట్టబడిన అభివృద్ధి వ్యయము రు. 4800 కోట్లు మాత్రమే. మనకున్న అవకాశాలు, అవసరాల దృష్ట్యా ఈ మొత్తము బహు తక్కువ అని వేరే చెప్పనవసరములేదు. దేశము త్వరితగతిని అభివృద్ధి చెందుటకు ప్రస్తుతం మనకు కేటాయించినమొత్తమునకు కొన్నిరెట్లు కావలసివస్తుంది. అయితే డబ్బు ఎక్కడనుంచి వస్తుందనేది వెంటనే వచ్చే ప్రశ్న. దీనికై భారత ప్రభుత్వము. ప్లానింగ్ కమీషన్ ప్రణాళికకు కావలసిన డబ్బుకై అవలంబించిన విధానాలను క్లుప్తంగానైనా పరిశీలించాల్సిన అవసరమున్నది. ప్రణాళికకు కావలసిన డబ్బు ఏవిధంగా సేకరించాలనేది ముఖ్య విధానాలకు సంబంధించిన సమస్య.

ద్వితీయ ప్రణాళికకు కావలసిన ద్రవ్యమునకై భారత ప్రభుత్వము చూపించిన వనరులను పరిశీలిద్దాం. ద్వితీయ ప్రణాళిక క్రింద ప్రభుత్వరంగమునందు ఉద్దేశించబడిన మొత్తము ఖర్చు రు. 4800 కోట్లు ఏవిధముగా సమకూరనున్నదో దిగువ వివరించబడినది.

| | (కోట్లలో) |
|---|---|
| 1. ప్రస్తుత ప్రభుత్వాదాయములనుండి మిగులు | |
| 1955–'56 పన్నుల రేట్ల ప్రకారం | 350 |
| అదనపు పన్నులద్వారా | 450 |
| | 800 |
| 2. ప్రజలనుండి ఋణాలు: | |
| మార్కెట్టు ఋణాలద్వారా | 700 |
| చిన్న నిల్వల పొదుపుద్వారా | 500 |
| | 1200 |

| | (కోట్లలో) |
|---|---|
| 3. బడ్జెట్టునుండి యితర ఆదాయములు : | |
| రైల్వేలనుండి అభివృద్ధి కార్యక్రమానికి | 150 |
| ప్రావిడెంటు పండులు, ఇతర డిపాజిట్లులనుండి | 250 |
| | 400 |
| 4. విదేశాలనుండి సహాయము | 800 |
| 5. లోటు బడ్జెట్టు పద్దులు | 1200 |
| 6. భర్తీకాకుండా మిగిలినది | 400 |
| మొత్తము | 4800 |

(ద్వితీయ పంచవర్ష ప్రణాళిక : 77, 78 పేజీలు)

1956–'57 నాటికి వివిధరకాల పన్నులద్వారా వస్తున్న మొత్తం రు. 350 కోట్లు గాక ద్వితీయ ప్రణాళికకాలంలో కొత్త పన్నులు విధించడంద్వారా అదనంగా రు. 450 కోట్లు వసూలుచేయాలని నిర్ణయించబడింది. తర్వాత భర్తీకాకుండా మిగిలిన రు. 400 కోట్లు కూడా అదనపుపన్నుల రూపంలో వసూలు చేయాలని నిర్ణయింపబడింది.

ఈ మొత్తము డబ్బు కేంద్రము, రాష్ట్రప్రభుత్వాలు వివిధరకాల కొత్త పన్నుల ద్వారా వసూలు చేయాల్సివున్నది. ఆచరణలోకి వచ్చేటప్పటికి యింతకంటె జాస్తిగానే పన్నులద్వారా వసూలుచేస్తున్నారనే విషయము మన రాష్ట్రములో పన్నుల విధానము చూచినప్పుడు బోధపడగలదు.

ఈ పన్నుల భారమంతా అటు కేంద్ర ప్రభుత్వముగాని, ఇటు రాష్ట్ర ప్రభుత్వాలుగాని సాధారణ ప్రజలపై మోపుతున్నారనేది స్పష్టమైన విషయమే. వివిధరకాల భూమిశిస్తులు, అభివృద్ధి పన్ను, అమ్మకపు పన్నులు, బట్టలు మొదలైన వస్తువులపై విధించే ఎక్సైజు పన్నులు – అన్నీ సాధారణ ప్రజలపై భారాన్ని రోజురోజుకు పెంచుతున్నాయి.

ఇక మార్కెటులో అప్పులద్వారా రు. 700 కోట్లు సంపాదించాలన్న విషయం చూద్దాము. ఈ మార్కెటులో సంపాదించే అప్పులకు ప్రభుత్వము అధిక వడ్డీని చెల్లించుతుంది. మార్కెటులో అప్పులంటే పెద్ద కోటీశ్వరుల దగ్గర ప్రభుత్వము తీసుకునేవే. అంటే కోటీశ్వరుల దగ్గర తీసుకునే ఈ అప్పుకు అధిక వడ్డీలను చెల్లించుతుంది.

చిన్నమొత్తాల పొదుపుద్వారా రు. 500 కోట్లు రాబట్టాలని అంచనా వేశారు. చిన్నమొత్తాల పొదుపులో ప్రధానభాగము దేశములోనున్న సాధారణ ప్రజానీకము దగ్గరనుంచి వసూలు చేస్తున్నారు. ఈనాడు వారి జీవిత పరిస్థితే దుర్భరంగానున్నప్పుడు ఇంత మొత్తము వారిదగ్గరనుండి వసూలు చేయాలనటం ఇప్పుడే దరిద్రము, అప్పులతోను బాధలుపడే వారిమీద యింకా అదనపు భారము మోపటమే కదా. ఈ చిన్నమొత్తాల పొదుపును ప్రభుత్వ ఆజ్ఞమేరకు ఉద్యోగస్తులు గ్రామసీమల్లో కొన్ని సందర్భాలలో బలవంతంగా కూడా వసూలు చేస్తున్న విషయము అందరికీ తెలిసిందే.

లోటుబడ్జెటు (Deficit Financing)ద్వారా 1200కోట్ల రూపాయలు రాబట్టాలని అంచనా వేయబడింది. అభివృద్ధిఅయ్యే ఆర్థిక విధానములో అధిక చలామణీ కొంతవరకు అవసరమే. కాని మన ఆర్థికవిధానము భరించలేని యింత మొత్తమును అధిక చలామణీలోకి తీసుకరావటముద్వారా సాధారణ ప్రజలు పూర్తిగా దెబ్బతింటారు. జీవితావసర వస్తువుల ధరలు పూర్తిగా పెరుగుటవలన పేదప్రజల జీవనప్రమాణము పూర్తిగా పడిపోతుందని వేరే చెప్పనక్కరలేదు.

అంటే ప్రణాళికకు కావలసిన ప్రధాన భాగమును చెల్లించవలసిన బాధ్యత సాధారణ ప్రజలపైననే మోపబడుతూంది. ఇటు పన్నులద్వారాగానీ, చిన్నమొత్తాల పొదుపుపేరుతోగానీ, ద్రవ్యాన్ని అధికంగా చలామణిలోకి తీసుకురావటముద్వారాగానీ ప్రధాన భారము సాధారణ ప్రజలే మోస్తున్నారు. సాధారణ ప్రజలపై అధిక భారాన్ని మోపకుండానే మన ప్రణాళికకు కావలసిన డబ్బు సంపా

దించుటకు అపూర్వమైన అవకాశాలు ఎన్నో ఉన్నవి. కాని, కాంగ్రెసు ప్రభుత్వం ఆ అవకాశాలను ఉపయోగించుకో నిరాకరిస్తూంది.

దేశంలోనున్న ప్రధాన సంపదనంతా తమక్రింద ఉంచుకున్న మాజీసంస్థానాధీశ్వరులనుంచి, పెట్టుబడిదార్ల నుంచి, పెద్ద జమీందార్ల నుంచి తగువిధంగా డబ్బురాబట్టకుండా మన ప్రణాళిక సక్రమంగా ముందుకు పోవటం సాధ్యమయ్యేపనిగాదు. దేశములో పెద్ద కోటీశ్వర్లు చట్టప్రకారము ప్రభుత్వానికివ్వవలసిన ఆదాయపు పన్నులో 200 కోట్లు మొదలు 300 కోట్ల రూపాయలవరకు ప్రతి సంవత్సరము ఎగవేస్తున్నారన్నవిషయాన్ని ప్రొఫెసర్ కల్దారు బయటపెట్టారు. ఈయన మన పన్నుల విధానాన్ని పరిశీలించుటకు భారతప్రభుత్వంచే నియమింపబడ్డారు. ఏ రైతో రెండు మూడు రూపాయలు శిస్తు బాకీవుంటే నిర్దాక్షిణ్యంగా చెంబు,తపేల బజారులోవేసి వసూలుచేస్తున్న కాంగ్రెసు ప్రభుత్వం ఆదాయపు పన్నుల ఎగవేతను అరికట్టి గట్టిగా వసూలు చేస్తే సంవత్సరమునకు 200 మొదలు 300 కోట్ల రూపాయలు ఆదాయమువస్తుంది. అంటే 5 ఏండ్లలో రూ 1000 మొదలు 1500కోట్ల ఆదాయము వస్తుంది.

అంతేగాదు. ఆదాయపు పన్ను డిపార్టుమెంటువారు యీ కోటీశ్వర్ల దగ్గరనుండి సక్రమంగా వసూలు చేయనుండిన రూ 300 కోట్లు ఆదాయపు పన్నుల బకాయీలు వసూలుగాకుండా వున్నాయి. ఇవి గట్టిగా వసూలు చేయటానికి ప్రభుత్వము పూనుకుంటే, ప్రణాళికకు కావలసిన డబ్బురాదా?

ఇదేవిధంగా పెద్ద కోటీశ్వర్లు చెల్లించే ఆదాయపుపన్నును ఇంకా కొంత పెంచితే, ప్రభుత్వానికి అదనపు ఆదాయము రాదా? కాని ప్రభుత్వం ఇందుకు తయ్యారుగాలేదు. జమీందారీ రద్దు తర్వాత జమీందారులకు భారతదేశము మొత్తముమీద వివిధరాష్ట్రాలలో నష్ట పరిహారము, దానికి వడ్డీ, పునరావాస గ్రాంట్ల క్రింద చట్టాలద్వారా యివ్వదల్చిన మొత్తము రూ. 623 కోట్లు. 1956 వరకూ 128 కోట్లు చెల్లించారు.

వివిధ రాష్ట్రాలలో యీ క్రిందివిధంగా జమీందారులకు నష్ట పరిహారము నిర్ణయించబడినది.

(కోట్ల రూపాయల్లో)

| రాష్ట్రము | నష్ట పరిహారం మరియు పునరావాస గ్రాంట్లు కలిసి చెల్లించవలసిన మొత్తం | ఇంతవరకు చెల్లించిన మొత్తం |
|---|---|---|
| ఆంధ్ర | 9.60 | 4.59 |
| హైదరాబాదు | 6.64 | 6.64 |
| అస్సాము | 5.18 | 0.46 |
| బీహారు | 240.00 | 4.61 |
| బొంబాయి | 28.74 | 7.96 |
| మధ్యప్రదేశ్ | 22.10 | 9.78 |
| మద్రాసు | 6.37 | 4.17 |
| మైసూరు | 3.91 | 1.07 |
| ఒరిస్సా | 10.50 | 0.47 |
| రాజస్థాన్ | 40.50 | 6.74 |
| కేరళ | 0.20 | — |
| ఉత్తరప్రదేశ్ | 179.00 | 78.88 |
| పశ్చిమబెంగాల్ | 70.00 | 3.01 |
| మొత్తం | 622.74 | 128.38 |

ఈ పట్టిక భాషాప్రయుక్త రాష్ట్ర విభజనకు పూర్వం తయారు చేసినది.

తమకు రావలసిన మొత్తాలకంటె ఎక్కువగా రైతాంగము నుండి ఎన్నోరెట్లు వసూలుచేసి తరతరాలుగా దోచుకున్న పెద్దపెద్ద జమీందారులకు నష్టపరిహారము యివ్వవలసిన అవసరమేమిటో అర్థముకాదు. ఏ ఆధారములేని చిన్న జమీందారులకు కొంత ఇవ్వ వచ్చును. కాని దేశాభివృద్ధిని ప్రణాళికకు డబ్బు కావలసిన యీ సమయములో కొంతకాలము కనీసము వాయిదా వేయవచ్చును.

పెద్దపెద్ద కోటీశ్వరులు సంపాదించే లాభాలపై గరిష్ట పరిమితి నిర్ణయించి తక్కినది తప్పనిసరిగా ప్రభుత్వానికి ప్రణాళిక కోసము అప్పుగా తీసుకోవచ్చును.

మనదేశములో గత రెండు వందల సంవత్సరాలనుంచి దోపిడీ చేసిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సంపాదించే లాభాలలో కనీసము కొంతభాగము, యీ దేశములో అభివృద్ధి ప్రణాళికల కొరకు తప్పని సరిగా అప్పు పెద్దపద్ధతిద్వారా సాధారణ ప్రజలపై యింకా పన్నుల భారము వేయకుండా చూడవచ్చును గదా !

మాజీ సంస్థానాధీశ్వరులైన పెద్దపెద్ద నవాబులకు, రాజులకు యింకా భరణముక్రింద 6 కోట్ల రూపాయలు చెల్లించుతున్నారు. ఈ మొత్తాన్ని మన ప్రణాళికకు వినియోగించవచ్చుగదా! వీటిపైన ఏలాంటి పన్నులూ లేవు.

ప్రభుత్వమే కొన్ని ముఖ్యమైన విదేశ వ్యాపారములు సాగించుటద్వారాను, బ్యాంకింగు, బొగ్గుగనులు, అల్యూమినియం పరి శ్రమలను జాతీయము చేయుటద్వారా ప్రభుత్వమునకు కోట్లకొలది రూపాయలు లాభము వస్తుంది.

మన దేశములో మన ప్రణాళికలకు ఇట్లాంటి గొప్పవనరు లున్నవి. కాని కాంగ్రెసు ప్రభుత్వ విధానము ప్రధానంగా ప్రణాళిక భారము పేదప్రజలపై వేస్తూ దేశంలోనున్న సంపదనంతను తమ క్రింద ఉంచుకున్న పెద్దపెద్ద జమీందారీ — భూస్వామ్య కోటీశ్వరులపై తగి

నంతభారాన్ని మోపనుండుటవలన గాని దేశ [illegible] అభివృద్ధి చేసుకొనుటకు కావలసిన డబ్బు సమకూర్చ లేకపోయింది. గాన దేశము యీ పద్ధతిలో అభివృద్ధి చెందక యిలా కొన్ని దశాబ్దాలకుకూడా ప్రజా జీవనము పరిస్థితి బాగుపడదు.

ప్రణాళికలో గొప్ప లక్ష్యాలను నిర్ణయించారు. పేదల పరిస్థితి త్వరగా అభివృద్ధి కావాలని, దేశములో పెద్ద ధనికులకు కావలసిన ధనంకోసమై ప్రభుత్వ భారమంతా సాధారణ ప్రజలపైన వేసే విధానము అవలంబిస్తున్నారు.

కాంగ్రెసు ప్రభుత్వాలు అవలంబిస్తున్న యీ విధానాలకు అనుగుణ్యంగానే మన రాష్ట్రములోనున్న పరిస్థితులుకూడా ఉన్నవి.

## 2. ఆంధ్ర ప్రదేశ్‌లో ద్వితీయ ప్రణాళిక స్వరూపం

భారతదేశములో ఆంధ్రప్రదేశ్ అయిదవ పెద్ద రాష్ట్రముగా నున్నది. విస్తీర్ణము 1,06,041 చదరపు మైళ్ళు. భారతదేశము యొక్క మొత్తము విస్తీర్ణములో మన రాష్ట్రం విస్తీర్ణము 8.4% ఉన్నది. మన రాష్ట్రములో గొప్ప అరణ్యములు, పర్వతములుఉన్నవి. మైకా, బొగ్గు తదితర ఖనిజసంపద, అపార జల సంపద కలిగిన కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పెన్నాలాంటి నదులు మన కున్నాయి. 540 మైళ్ళ సముద్రతీరమున్నది. విశాలమైన, సారవంతమైన లక్షల ఎకరాల భూమియున్నది. 3 కోట్ల 48 లక్షల ప్రజలున్నారు. జనాభా ప్రకారము భారతదేశములో మనది నాల్గవరాష్ట్రము.

| వి వ ర ము | విస్తీర్ణము (లక్షల ఎకరాలు) | మొత్తము భూమిలో శాతం |
|---|---|---|
| 1. మొత్తము భూమి విస్తీర్ణము | 664.32 | |
| 2. అడవులు | 140.26 | 21.1% |
| 3. వ్యవసాయమునకు పనికిరాని పర్రభూములు | 72.38 | 10.8% |
| 4. వ్యవసాయేతర పనుల కుపయోగించే భూమి | 33.33 | 5.0% |
| 5. వ్యవసాయయోగ్యమయిన బంజర్లు | 41.09 | 6.2% |
| 6. శాశ్వత పచ్చిక బయళ్లు మరియు యితర పశువుల మేత కుపయోగించే బీళ్లు | 28.78 | 4.3% |
| 7. తదితర పంటలు, చెట్లు, తోపులు మొదలగు వాటి ఉపయోగములోనున్న భూమి (ఇది మొత్తము సాగుభూమిలో చేర్చబడలేదు.) | 6.23 | 0.9% |
| *8. ప్రస్తుతపు పడావులు | 54.88 | 8.3% |
| ♦9. ఇతర పడావులు | 17.38 | 2.6% |
| 10. మొత్తము సాగు క్రింద నున్న భూమి | 270.00 | 40.6% |
| 11. ఒకసారికంటె జాస్తి సాగులో వుండే భూములు | 23.81 | |
| 12. మొత్తము సాగులో వుండే భూమి | 293.81 | |

(పేజీ 11 : ఆంధ్రప్రదేశ్ ద్వితీయ ప్రణాళిక)

* గత సంవత్సరము సాగుచేసి ఈ సంవత్సరము సాగుచేయకుండా బీడు పెట్టబడిన భూమి.

♦ ఒక సంవత్సరముపైన, 5 సంవత్సరాలలోపు సాగుచేయకుండా బీడు పెట్టబడిన భూములు.

జాతీయ ప్రణాళిక మాదిరిగానే మన రాష్ట్రమునకు రెండవ ప్రణాళిక క్రింద కేటాయించిన మొత్తం సత్వరంగా అభివృద్ధిని సాధించుటకు ఏ మాత్రమూ చాలదు.

మన రాష్ట్రమునకు రెండవ ప్రణాళికలో యీ క్రిందివిధంగా ధనాన్ని కేటాయించారు :

| అభివృద్ధి రంగాలు | భారతదేశం | | ఆంధ్రప్రదేశ్ | |
|---|---|---|---|---|
| | మొత్తం కేటాయింపు (రూ. కోట్లు) | మొత్తంలో శాతం | మొత్తం కేటాయింపు (రూ. కోట్లు) | మొత్తంలో శాతం |
| వ్యవసాయం సమాజాభివృద్ధి | 568 | 11.8 | 39.85 | 22.7 |
| నీటి పారుదల విద్యుచ్ఛక్తి | 913 | 19.0 | 76.46 | 43.5 |
| పరిశ్రమలు–గనులు | 890 | 18.5 | 14.26 | 8.1 |
| రవాణా–వార్తా వాహక సౌకర్యాలు | 1385 | 28.9 | 7.69 | 4.3 |
| సాంఘిక సేవా కార్యక్రమాలు | 945 | 19.7 | 34.43 | 19.9 |
| తదితరములు | 99 | 2.1 | 2.67 | 1.5 |
| మొత్తం | 4800 | | 175.36 | |

(ఆంధ్రప్రదేశ్ ద్వితీయ ప్రణాళిక)

మన రాష్ట్రంలో మనకున్న అవకాశాలు, అవసరాలదృష్ట్యా ఈ మొత్తం చాలా తక్కువని వేరే చెప్పనవసరం లేదు.

కానీ, ఉన్నంతలో కూడా మన రాష్ట్రమునకు ప్రణాళిక కేటాయింపు విషయంలో ఏమాత్రమూ న్యాయం జరుగలేదు.

మొత్తము జాతీయ ప్రణాళిక 4800 కోట్లు. ఇందులో రూ 2559 కోట్లు కేంద్ర ప్రభుత్వమే ఖర్చుపెట్టింది. తక్కిన రూ 2241 కోట్లు వివిధ రాష్ట్రములమధ్య విభజించబడనది. మన జనాభా దేశ జనాభాలో 8.8% వున్నది. కాన జనాభా ప్రకారము మన రాష్ట్రము నకు రూ 199 కోట్లు రావలసియున్నది. కాని మన రాష్ట్రమునకు కేటాయించినది రూ 175 కోట్లు మాత్రమే. అనగా రూ 24 కోట్లు తగ్గించబడినది.

పోతే కేంద్రప్రభుత్వముయొక్క వాటా రూ. 2559 కోట్ల లోనూ మన రాష్ట్రములో ఖర్చుపెట్టినది బహుతక్కువ. పరిశ్రమలలో కేంద్రప్రభుత్వ వాటాక్రింద ఆంధ్రప్రదేశ్‌లో 19 కోట్లు మాత్రము కేటాయించబడినది. ఇంతవరకు చాల తక్కువ మాత్రము ఖర్చు చేయ బడినది. కొంత రైల్వేలక్రింద ఖర్చు పెట్టబడినది. తక్కిన మొత్త మంతా యితర రాష్ట్రముల్లోనే ఖర్చు చెయబడుతున్నది. కేంద్రము ఖర్చుపెట్టున్న మొత్తమునుంచి మన జనాభా నిష్పత్తిప్రకారము మన రాష్ట్రములో రు 205 కోట్లు ఖర్చు చేయవలసి వున్నది. దీనికై కేంద్రము వాటాలో 19 కోట్లు పరిశ్రమలకై కేటాయించబడినది. రైల్వే డబుల్ లైన్సు వేయుట మొదలగువాటికి రూ 30 కోట్లు మనకు ఖర్చు చేయవచ్చును.

అంటే కేంద్రము మన రాష్ట్రములో ఖర్చు చేయవలసిన రూ 205 కోట్లకుగాను 50 కోట్లు కెటాయించబడినది. ఇందులో చాలా తక్కువభాగము యీ నాలుగు సంవత్సరములలో ఖర్చు చేశారు. అదేవిధంగా ప్రయివేటురంగమునకు కేటాయించిన రూ 2400 కోట్లలో మన రాష్ట్రములో చెప్పుకోదగినదేమీ ఖర్చు చేయబడ లేదు. ఈ ఖర్చు రూ 10 కోట్లకు మించి ఉండదని చెప్పవచ్చును.

పైన వివరించినవిధంగా ప్రభుత్వ రంగములో 4800 కోట్లు, ప్రయివేటు రంగములో 2400 కోట్లు మొత్తము రూ. 7200 కోట్లకు గాను మన జనాభాప్రకారము ప్రభుత్వ, ప్రయివేటురంగములలో కలసి మన రాష్ట్రప్రణాళిక మొత్తము రు. 633 కోట్లు ఉండాలి. కనీసం

600 కోట్లయినా కేటాయింపబడాలి. కాని రాష్ట్ర ప్రభుత్వముక్రింద రు. 175 కోట్లు, కేంద్రము కేటాయింపు షుమారు రు. 50 కోట్లు, ప్రైవేటు రంగములో షుమారు 10 కోట్లు మొత్తము రు. 235 కోట్లకు లోపుగానే వుంటుంది. ఈ విషయములో ఆంధ్రకు చాలా అన్యాయము జరిగినదని వేరే చెప్పనవసరము లేదు.

ఇక ఆంధ్రప్రదేశ్‌లో ప్రణాళికకు కావలసిన వనరులను యె విధంగా సేకరించదలచారో చూద్దాము.

రూ. కోట్లలో

మొత్తం ఆంధ్రప్రదేశ్‌లో ద్వితీయ ప్రణాళికక్రింద ఖర్చు :

| | |
|---|---|
| 1. రివెన్యూ ఖాతాక్రింద ఖర్చు | 55.16 |
| 2. పెట్టుబడిఖాతాక్రింద ఖర్చు | 104.07 |
| 3. ఋణాలు యిచ్చుటకు | 16.14 |
| మొత్తము ఖర్చు | 175.37 |

(ఇదిగాక ప్లానింగ్ కమిషన్ తెలంగాణా ప్రాంతానికి మరల 37.68 లక్షలు కేటాయించింది)

మొత్తము ఖర్చు 175.37 కోట్లకుగాను ఈ క్రింది విధముగా వనరులను సమకూర్చాలని అంచనా వేయబడినది.

రివెన్యూ ఖాతాక్రింద వనర్లు :

| | | |
|---|---|---|
| 1. రివెన్యూ ఖాతానుంచి అప్పటికున్న పన్నుల రేటునుబట్టి మిగులు | ... | (–) 4.1 |
| 2. అదనపు పన్నులద్వారా | 9.5 | |
| 3. కేంద్రం విధించే అదనపు పన్నుల ద్వారా రాష్ట్రమునకువచ్చే మొత్తం భాగం | 5.0 | |
| 4. కేంద్రంనుంచి వచ్చే గ్రాంట్లు | 27.1 | |
| | 41.6–4.1=37.5 | |

రివెన్యూ ఖాతాక్రింద వచ్చే మొత్తము వనరులు (1 మొదలు 4 పద్దువరకు మొత్తము) 37.5

పెట్టుబడి ఖాతా క్రిందవచ్చే మొత్తమువనరులు :

| | | |
|---|---|---|
| 1. ప్రజలనుండి ఋణములద్వారా | 26.7 | |
| 2. చిన్న మొత్తముల పొదుపు (ఋణముల) ద్వారా | 3.0 | |
| 3. ఇతరములు | 2.3 | |
| 4. చెల్లించవలసిన అప్పులు | — | 5.9 |
| | 32.0 — | 5.9 = 26.1 |

| | |
|---|---|
| మొత్తము పెట్టుబడిఖాతాక్రిందవనరులు (1 మొదలు 4 వ పద్దు వరకు) మొత్తం | 26.1 |
| మొత్తము ప్రణాళిక ఖర్చు | 175.3 |
| రివెన్యూ మరియు పెట్టుబడి ఖాతాల క్రింద వచ్చే మొత్తము ఆదాయం | 63.6 |
| లోటు ... | 111.7 |

మొత్తము ప్రణాళిక ఖర్చు 175.3 కోట్లలో పైన చూపిన రివెన్యూ మరియు పెట్టుబడి ఖాతా క్రింద వున్న వనరులు 63.6 కోట్లు మాత్రమే. ఇంకా 111.7 కోట్లు కావలసియున్నది. దీనికై కేంద్రము 104.2 కోట్లు ఋణములద్వారా యిస్తుంది. మిగతా 7.1 కోట్లు సమకూర్చవలసియున్నది. దీనికిగాను ప్లానులో నున్న నీటిపారుదల, విద్యుచ్ఛక్తి, పరిశ్రమలు మొదలగు స్కీములు అమలు జరుపుటద్వారా 26.93 కోట్లు ఆదాయం రావచ్చును. అందులో సగం ఖర్చులక్రింది తీసివేసినా 13.5 కోట్లు మిగులుతుంది. కాన ప్లాను ఖర్చుకు కావలసిన వనరులున్నవి.

(ఆంధ్రప్రదేశ్ రెండవ ప్రణాళికనుండి.)

# 3. పన్నులద్వారా రాబడి

ఆంధ్రప్రదేశ్ ప్రణాళిక కోసము ఏవిధంగా వనరులు సమకూర్చుటకు ఆలోచించారో పై వివరాలను బట్టి అర్థమవుతుంది. కాని రివెన్యూ ఖాతా క్రిందగాని, పెట్టుబడిఖాతా క్రిందగాని, కేంద్రము నుంచి వచ్చేమొత్తము గాని ఏవిధంగా వస్తున్నాయో వివరంగా తెలుసుకోవాలన్నప్పుడు ప్రభుత్వ బడ్జెట్టు ప్రతిపాదనలను వివరంగా పరిశీలిస్తేగాని సాధ్యముకాదు. రాష్ట్రములోనున్న సాధారణ ప్రజానీకముపై రకరకాల పన్నులద్వారా మొత్తముభారము మోపబడుతుందన్న విషయము అర్థమవుతుంది. అయితే బడ్జెటు ప్రతిపాదనలు చూసేముందు ఏ యే రకాల పన్నులు విధించబడ్డాయో కొంతపరిశీలించుట అవసరము. రెండవప్రణాళిక ప్రారంభము కాబోయే ముందు అనగా 1955–56 లో ఆంధ్రప్రభుత్వము యీ క్రింది పన్నులు విధించింది.

1. భూమిశిస్తు పై సర్ ఛార్జీ.
2. యీనాము భూములపై రైత్వారీ శిస్తువిధింపు.
3. వర్జీనియా పొగాకుపై కొనుగోలుపన్ను, తక్కువ రకం చుట్టలు, సిగరెట్లు అమ్మకంపన్ను.
4. మిల్లుబట్టలపై ఒక స్థలంలో అమ్మకంపన్ను.
5. కోర్టుఫీజు, దావా వాల్యుయేషను పెంచుట.

మొత్తంపైపన్నుల ద్వారా సంవత్సరమునకు 1 కోటి 73 లక్షలు ఆదాయం వస్తుందని చెప్పబడింది. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో ప్రశ్న

నం.2985కు ఆర్థిక మంత్రి సమాధానము చెపుతూ 1956–57, 57–58, 58–59 సంవత్సరములవరకు విధించిన పన్నులు, తర్వాత కాలములో విధించబోయే పన్నులు, వాటివలన వస్తుందని అంచనా వేయబడిన మొత్తము ఆదాయము యీ క్రింది విధంగా వివరించారు.

| విధించిన పను | ఏ సంవత్సరములో విధింపబడె | ఏ ప్రాంతంలో | ప్రతి సంవత్సరం వచ్చే ఆదాయం (కోట్లలో) |
|---|---|---|---|
| 1. ఆహారధాన్యములపై కొనుగోలు పన్ను | 1956–57 | ఆంధ్ర | 3.15 |
| 2. నాటుపుగాకుపైకొనుగోలుపన్ను | 1956–57 | ఆంధ్ర | 1.35 |
| 3. అమ్మకము పన్ను చట్టాన్ని సవరించుట | 1956–57 | ఆంధ్ర | 1.35 |
| 4. రాష్ట్రాలమధ్య అమ్మకంపన్ను | 1956–57 | ఆంధ్రప్రదేశ్ | 1.75 |
| 5. అభివృద్ధి పన్ను | 1956–57 | ,, | 0.20 |
| 6. భూమిశిస్తు ప్రమాణీకరణ చట్టం | 1956–57 | ఆంధ్ర | 0.75 |
| 7. నీటితీరువ నూటికి 25 వంతులు పెంచటము | 1956–57 | ,, | 1.15 |
| 8. పూర్వపు హైద్రాబాద్ ప్రభుత్వం పన్నువిధానంలోచేసినమార్పుల ఫలితంగా | 1956–57 | తెలంగాణ | 0.60 |
| 1. అమ్మకంపన్నుచట్టాన్ని సవరించి ఆంధ్రప్రదేశ్ అంతటికీ వర్తింపచేయుట | 1957–58 | ఆంధ్రప్రదేశ్ | 3.93 |
| 2. మోటారు స్పిరిట్ పై అదనపు అమ్మకం పన్ను | 1957–58 | తెలంగాణ | 0.28 |

| | | | |
|---|---|---|---|
| 3. నీటితీరువాకు నూటికి 25వంతుల నుంచి 50 వంతులవరకు పెంచుట | 1957–58 | ఆంధ్ర | 0.44 |
| 4. మోటారుబండ్లు, అవి మోసుకు పోవు ప్రయాణీకులు, వస్తువులపై పన్ను | 1957–58 | తెలంగాణ | 0.77 |
| 5. పంచదారమిల్లులకుతోలే చెరకుపై సెస్సు | 1957–58 | ఆంధ్ర | 1.33 |
| 6. భూమిశిస్తుపై సర్ ఛార్జి | 1957–58 | ఆంధ్రప్రదేశ్ | 1.20 |
| 7. వాణిజ్యపంటలపై ప్రత్యేకపన్ను | 1957–58 | ,, | 2.15 |
| 1. స్టాంపు డ్యూటీని పెంచుట, ఒకే రకమైన రిజిస్ట్రేషనుఫీజు ఆంధ్ర ప్రదేశ్ అంతటా వర్తింపచేయుట | 1598–59 | ముఖ్యంగా తెలంగాణ | 0.60 |
| 2. బస్సుప్రయాణీకులపైన, సరకుల పైన పన్ను | 1959–60 | ఆంధ్ర | 1.50 |
| | | మొత్తం — | 22.50 |

ఈ పద్ధతులేగాక యింకా అనేక పద్ధతులద్వారా ద్వితీయ ప్రణాళికా కాలంలో పన్నులభారం విపరీతంగా పెంచారు. మొత్తం వివిధరూపాల్లో మన రాష్ట్రంలో పన్నులభారం ఎంత పెంచారో తెలుసుకోవాలంటే ఒక్కసారి మన బడ్జెటు ప్రతిపాదనలను వివరంగా పరిశీలించితే అర్థమవుతుంది

## 1. ఆ దా య ం :

ఆర్థిక మంత్రిగారు 1960–61 బడ్జెటును ప్రతిపాదిస్తూ శాసన సభకు సమర్పించిన ఉపన్యాసం తెలుగుకాపీ 39, 40 వ పేజీలలో దిగువ రీతిగా చూపబడింది :

# అనుబంధం - రెండు

## రెవెన్యూ ఖాతాలో ఆదాయ వ్యయాల సమీక్ష

సూచన :—1956–57 లెక్కలు ఆంధ్రకు మాత్రమే సంబంధించినవి. 1956–57 లెక్కలలో ఆంధ్ర ప్రాంతమునకు సంబంధించిన పూర్తి సంవత్సరము అంకెలున్ను, తెలంగాణమునకు సంబంధించిన ఆఖరి 5 నెలల అంకెలున్ను చేరియున్నవి.

### ఎ. ఆదాయం

రు. లక్షలలో

| పద్దుల వివరము | 1956–57 లెక్కలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 బడ్జెటు అంచనా |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| I. ఆదాయపు పన్ను, యూనియన్ ఎక్సైజు పన్నులు, అదనపు ఎక్సైజు పన్నులు, ఎస్టేటు సుంకము, రైల్వే చార్జీల పై పన్ను ... | 534.76 | 1,007.81 | 1,327.34 | 1,396.26 | 1,166.29 |
| మొత్తం ... | 534.76 | 1,007.81 | 1,327.34 | 1,396.26 | 1,166.29 |

రు. లక్షలలో

| పద్దుల వివరము | 1956–57 లెక్కలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 బడ్జెటు అంచనా |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| II. ప్రధానమైన ఆదాయపు పన్నులు — భూమి శిస్తు (నీటిపారుదల వల్ల వచ్చే ఆదాయంతో సహా) ... | 751.52 | 1,058.03 | 1,038.95 | 1,150.00 | 1,200.00 |
| రాష్ట్ర ఎక్సైజు పన్నులు | 272.71 | 633.05 | 659.42 | 718.70 | 761.15 |
| స్టాంపులు ... | 264.83 | 272.90 | 251.31 | 264.55 | 274.60 |
| అడవులు ... | 158.54 | 246.66 | 274.08 | 270.84 | 267.00 |
| రిజిస్ట్రేషను ... | 47.15 | 57.69 | 69.06 | 90.00 | 95.00 |

## అనుబంధం రెండు — (తరువాయి)

### ఎ. ఆదాయం — (తరువాయి)

రు. లక్షలలో

| పద్దుల వివరము | 1956–57 లెక్కలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 బడ్జెటు అంచనా |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| వాహనము మీద పన్నులు ... | 200.95 | 234.66 | 257.65 | 275.00 | 280.00 |
| అమ్మకం పన్ను ... | 598.79 | 893.40 | 845.52 | 969.26 | 1,019.16 |
| మోటారు స్పిరిట్ పన్నుల చట్టంక్రింద అమ్మకాలమీద రాబడి ... | 68.64 | 69.22 | 75.18 | 104.57 | 106.77 |
| ఇతర పన్నులు సుంకాలు ... | 100.90 | 133.98 | 105.41 | 204.13 | 232.73 |
| మొత్తం ... | 2,464.03 | 3,600.19 | 3,576.61 | 4,047.05 | 4,236.41 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| **III.** విద్యుత్ప్రణాళికల మీద రాబడి — | | | | | |
| మొత్తం రాబడి | 141.06 | 202.44 | 442.25 | 391.70 | 408.17 |
| నిర్వహణ ఖర్చులు | | | (—) 382.40 | (—) 197.44 | (—) 209.71 |
| నికరం ... | 141.06 | 202.44 | 59.85 | 194.26 | 198.46 |
| **IV.** ఇతర పద్దుల క్రింద | | | | | |
| రాబడి ... | 703.97 | 1,422.19 | 1,788.43 | 2,170.62 | 2616.87 |
| పూర్తి మొత్తం ... | 8,843.82 | 6,232.63 | 6,752.23 | 7,808.19 | 8,218.03 |

(1960-61 బడ్జెటు సమావేశంలో మంత్రిగారి ఉపన్యాసంనుండి)

(IV. అంశము క్రింద చూపిన ఇతర పద్దుల క్రింద రాబడి అనేది, న్యాయశాఖ, జైళ్లు, పోలీసు, విద్య, వైద్యము, ప్రజారోగ్యము, వ్యవసాయము, పశుపోషణ, సహకారశాఖ, పరిశ్రమలు, గృహ నిర్మాణములు మొదలైన వివిధ శాఖల క్రిందవచ్చే ఆదాయము. ఈ వివరాలు బడ్జెట్ ప్రతిపాదనలలో సవివరంగా చూపారు. ఇచ్చట ఉపన్యాసంలో వాటిమీదవచ్చే ఆదాయమంతా ఒకే మొత్తంగా IV ఇతర పద్దుల క్రింద రాబడి క్రింద చూపబడినది.)

## బి. రెవెన్యూ ఖాతాలో ఖర్చు

రు. లక్షలలో

| పద్దుల వివరము | 1956–57 లెక్కలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 బడ్జెటు అంచనా |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| I. జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలు— | | | | | |
| విద్య ... | 672.31 | 1,036.92 | 1,256.47 | 1,446.65 | 1,525.16 |
| వైద్య వసతి ... | 185.17 | 298.88 | 349.24 | 414.60 | 438.02 |
| ప్రజారోగ్యం ... | 78.61 | 125.50 | 116.76 | 297.48 | 290.37 |
| వ్యవసాయం ... | 104.96 | 174.52 | 211.30 | 317.51 | 342.79 |
| పశువైద్యం ... | 44.64 | 66.31 | 90.82 | 111.32 | 142.57 |
| సహకారం ... | 58.32 | 36.86 | 138.53 | 163.87 | 194.79 |
| పరిశ్రమలు ... | 93.12 | 91.13 | 136.16 | 173.26 | 195.22 |
| సివిల్ నిర్మాణాలు ... | 259.05 | 320.27 | 445.22 | 543.16 | 529.46 |
| జాతీయ వికాస కార్యక్రమం (కమ్యూనిటీ డెవలప్‌మెంట్, స్థానిక అభివృద్ధి ప్రణాళికలు, జాతీయ విస్తరణ సర్వీసుబ్లాకులు.) | 191.01 | 292.56 | 311.16 | 384.07 | 449.96 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| షెడ్యూలు జాతులు, కులాల సముద్ధరణ ... | 126.48 | 197.45 | 250.88 | 312.85 | 304.21 |
| మొత్తం ... | 1813.67 | 2640.40 | 3306.54 | 4164.77 | 4412.55 |
| II. ఆదాయంమీద ప్రత్యక్ష ఖర్చులు (లేక ప్రధానమైన ఆదాయం పద్దులకు చెందిన నిర్వహణ ఖర్చులు) ... | 310.45 | 419.97 | 452.77 | 623.18 | 768.28 |
| III. ఋణములమీద వడ్డీ వగైరా ఖర్చులు ... | 322.42 | 567.88 | 555.18 | 670.62 | 788.10 |
| IV. పెన్షను ... | 114.06 | 200.85 | 185.52 | 247.18 | 245.15 |
| V. ఇతరపద్దులు (పరిపాలన, న్యాయనిర్వహణ, పోలీసు వగైరా) ... | 1,240.72 | 1,681.82 | 1,831.96 | 1,907.46 | 1,983.94 |
| పూర్తి మొత్తం ... | 3807.32 | 5570,92 | 6341.97 | 7673.21 | 8198.02 |

## సి. రెవెన్యూ ఖాతా వినా ఇతర పెట్టుబడి ఖర్చు

రు. లక్షలలో

| పద్దుల వివరము | 1956–57 లెక్కలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 బడ్జెటు అంచనా |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| **I.** జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమాలు— | | | | | |
| నీటిపారుదల ... | 894.50 | 1,177.74 | 1,356.26 | 1,623.90 | 1,677.68 |
| విద్యుచ్ఛక్తి ... | 912.16 | 798.15 | 578.60 | 184.27 | 291.82 |
| పారిశ్రామికాభివృద్ధి ... | 34.94 | 204.74 | 230.87 | 503.87 | 370.48 |
| వ్యవసాయాభివృద్ధి పరిశోధన ... | 9.20 | 26.03 | 34.14 | 54.50 | 93.30 |
| సివిల్ నిర్మాణాలు ... | 164.25 | 249.07 | 345.11 | 441.37 | 546.28 |
| ఆరోగ్యాభివృద్ధి ... | 79.34 | (—) 6.93 | 1.09 | 70.97 | 108.67 |
| మొత్తం ... | 2094.39 | 2448.80 | 2551.07 | 2878.88 | 3088.23 |
| **II.** ఇతర సౌకర్యములు ... | 29.23 | 78.84 | (—) 79.90 | 130.97 | 156.0[illegible] |
| పూర్తి మొత్తం ... | 2123.62 | 2527.64 | 2471.17 | 3009.85 | 3244.31 |

అంటే మొత్తం 1956–57 మొదలు 1960–61 లో ప్రభుత్వ ఆదాయం ఖర్చులు చూపబడ్డాయి.

(ప్లానుక్రింద ఖర్చుపెట్టేదికూడా మొత్తం బడ్జెటు జమా ఖర్చులలో భాగమే. అందులోనే కలసి వుంటుంది.)

పై బడ్జెటు లెక్కలనుండి రెండవ ప్రణాళికా కాలంలో పన్నులభారం ఏవిధంగా పెరిగినదో పరిశీలిద్దాం.

క్రింది పట్టికలో 1956–57 సంవత్సరం లెక్కలలో తెలంగాణాకు ఆఖరు 5 నెలల అంకెలు మాత్రమే వున్నవి. అందువలన ఈ సంవత్సరమునకు సవరించిన అంచనాలు తీసుకోబడ్డాయి. అంకెలన్నీ బడ్జెటు ప్రతిపాదనలనుంచి తీసుకోబడ్డాయి.

# ఆంధ్రప్రదేశ్‌లో పన్నుల వివరాలు

(అంకెలు లక్షల రూపాయలలో)

| వివరాలు | 1955–56 లెక్కలు | 1956–57 సవరించిన అంచనాలు | 1957–58 లెక్కలు | 1958–59 లెక్కలు | 1959–60 సవరించిన అంచనాలు | 1960–61 బడ్జెటు అంచనాలు |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| I. ఆదాయపు పన్ను, యూనియన్ ఎక్సైజు పన్నులు, అదనపు ఎక్సైజుపన్నులు, ఎస్టేటు సుంకం, రైల్వే ఛార్జీలపై పన్ను | 661.05 | 662.15 | 1007.81 | 1327.34 | 1396.26 | 1166.29 |
| II. ప్రధానమైన ఆదాయపు పన్నులు : | | | | | | |
| (1) భూమిశిస్తు (నీటి పారుదలనుండి వచ్చే ఆదాయంతో సహా) | 806.36 | 931.48 | 1058.63 | 1038.95 | 1150.00 | 1200.00 |
| (2) రాష్ట్ర ఎక్సైజుపన్ను | 490.46 | 564.92 | 633.05 | 659.42 | 718.70 | 761.15 |
| (3) స్టాంపులు | 231.18 | 261.65 | 272.90 | 251.34 | 264.55 | 274.60 |
| (4) రిజిస్ట్రేషన్ | 42.11 | 46.05 | 57.69 | 69.06 | 90.00 | 95.00 |
| (5) వాహనములమీద పన్నులు | 194.03 | 206.79 | 234.66 | 257.65 | 275.00 | 280.00 |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| (6) అమ్మకపు పన్నులు | 504.45 | 612.00 | 893.40 | 845.52 | 969.26 | 1019.16 |
| (7) మోటారు స్పిరిట్ పన్నుల చట్టం క్రింద, అమ్మకాలమీద రాబడి | 60.37 | 75.25 | 69.22 | 75.18 | 104.57 | 106.77 |
| (8) ఇతర పన్నులు, సుంకాలు | 71.26 | 90.88 | 133.98 | 105.41 | 204.13 | 232.18 |
| మొత్తం : | 2400.22 | 2789.02 | 3353.53 | 3302.53 | 3776.21 | 3969.41 |
| III. (1) స్థానిక సంస్థలకు వారి తరపున భూమి శిస్తులు, ఇతర శిస్తులు వసూలు చేసి అదనంగా చెల్లించే మొత్తము | ... | 152.28 | 143.17 | 161.49 | 150.00 | 150.00 |
| (2) 1948 జమీందారీరద్దు చట్టం సె. 55 (1) క్రింద జమీందారులకు చెల్లించు మొత్తము | ... | 5.22 | 5.91 | 3.46 | 4.00 | 4.00 |
| (3) శిస్తు తగ్గింపు చట్టం క్రింద జమీందారులకు చెల్లించు మొత్తము | ... | 7.34 | 6.71 | 6.40 | 5.50 | 5.00 |
| | ... | 164.84 | 155.79 | 171.35 | 159.50 | 159.00 |
| మొత్తం | 3061.27 | 3616.01 | 4517.13 | 4801.22 | 5331.97 | 5294.70 |

ద్వితీయ ప్రణాళికాకాలము 5 సంవత్సరాల్లో వసూలుచేసిన పన్నుల మొత్తం (రూపాయలు లక్షలలో)

| | |
|---|---|
| 1956–57 (సవరించిన అంచనాలు) | 3616.01 |
| 1957–58 లెక్కలు | 4517.13 |
| 1958–59 లెక్కలు | 4801.22 |
| 1959–60 (సవరించిన అంచనాలు) | 5331.97 |
| 1960–61 (బడ్జెటు అంచనాలు) | 5294.70 |
| అయిదు సంవత్సరాల మొత్తం. | 23561.03 లేక 235.61 కోట్లు. |

పై మొత్తంలో ద్వితీయ ప్రణాళికాకాలంలో అదనపు పన్నులద్వారా వసూలు చేసిన మొత్తం

| | | | లక్షల రూపాయల్లో | ప్రతిఏటా పెరుగుదల శాతం |
|---|---|---|---|---|
| 1955–56 కంటె 1956–57లో | అదనపు పన్నుల ద్వారా వసూలుచేసినది | 3616.01–3061.27 | = 554.74 | 18% |
| 1955–56 ,, 1957–58లో | ,, | 4517.13–3061.27 | = 1455.86 | 47.5% |
| 1955–56 ,, 1958–59లో | ,, | 4801.22–3061.27 | = 1739.95 | 56.8% |
| 1955–56 ,, 1959–60లో | ,, | 5331.97–3061.27 | = 2270.70 | 74.1% |
| 1955–56 ,, 1960–61లో | ,, | 5294.70–3061.27 | = 2233.43 | 72.9% |

ద్వితీయ ప్రణాళికాకాలం 5 సం॥లలో అదనంగా వసూలుచేసిన పన్నుల మొత్తం : 8254.68

I. మొదటి పద్దుక్రింద కేంద్రము మన రాష్ట్రమునుంచి వసూలుచేసు కొని, మన రాష్ట్రమునకుయిచ్చే వాటా. వీటిలో ఆదాయపు పన్ను, ఎస్టేటు సుంకము తప్ప తక్కినవన్నీ సాధారణ ప్రజానీకముపైబడే పన్నులే.

II. రెండవ పద్దుక్రింద వసూలు చేయబడే భూమిశిస్తు, నీటి తీరువా, అమ్మకపు పన్ను మొదలగునవన్నీ ప్రధానంగా సాధారణ ప్రజల మీద పడేవే.

III. మూడవ పద్దుక్రింద చెల్లించే పన్నులు ప్రభుత్వ ఆదాయముక్రింద చూపరు. కారణం యీ మొత్తాలను ప్రభుత్వము వసూలుచేసి వాటిని వాపసు చేస్తుంది. కాని ప్రజలు మాత్రము ఆ పన్నులు చెల్లించవలసినదే.

(1) స్థానిక సంస్థలకుగాను విద్య మొదలగు సెస్సులను, ఆంధ్ర, తెలంగాణాలలో ప్రభుత్వమే వసూలు చేస్తుంది. (ఆంధ్రలో రూ 1కి 0–5–0, తెలంగాణాలో రూ 1కి 0–2–0) దీని ద్వారా ప్రభుత్వానికి షుమారు 2 కోట్ల 30 లక్షలు ఆదాయము వస్తుంది. కాని ఇందులో స్థానిక సంస్థలకు 1 కోటి 50 లక్షలు మాత్రమే చెల్లిస్తూన్నారు. తక్కినది రాష్ట్రాల ఆదాయములోనే కలుపబడుచున్నది. అందుచేత 1 కోటి 50 లక్షలు ప్రభుత్వాదాయములో చూపబడదు. స్థానిక సంస్థలకు వాపసు యిచ్చినట్లు చూపబడుతుంది. కాని ఇది రైతాంగము చెల్లించేపన్నే.

(2) జమీందారీ ప్రాంతాల్లో జమీందారీ రద్దుఅయిన తర్వాత, అంతకుముందు రైతులు చెల్లించవలసిన బకాయీలు వడ్డీతో సహా ప్రభుత్వము వసూలుచేసి, వసూలుచేసినందుకు 10% తీసుకొని మిగతా డబ్బు సెక్షన్ 55 (I) మద్రాసు ఎస్టేట్ల రద్దుచట్టము (1948) క్రింద జమీందార్లకు చెల్లిస్తారు. దీనిని ప్రభుత్వ ఆదాయముక్రింద చూపలేదు. కాని రైతాంగము మాత్రము పన్నులు చెల్లించాల్సిందే.

(3) ఇంకా రద్దుకాని ఎస్టేట్సులో శిస్తు తగ్గింపు చట్టము (1947) ప్రకారము ప్రభుత్వమే రైతుల దగరనుంచి శిస్తు వసూలు చేసి జమీందారులకు చెల్లించాల్సి వున్నది. ప్రభుత్వా దాయము క్రింద చూపబడలేదు. కాని రైతాంగం చెల్లించే పన్నే యిది.

అంచేత యీ మూడు పద్దుల క్రింది రైతాంగమునుండి వసూలు చేస్తున్న ప్రభుత్వాదాయము (బడ్జెటు ఆదాయములో చూపబడదు. (బడ్జెటు వివరాలలో యీ విషయాలన్నీ వున్నాయి) కాని ప్రజలపై పన్నుల భారాన్ని లెక్కగట్టేటప్పుడు యీ మొత్తాన్ని కూడా తీసుకోవాల్సి వున్నది.

మొత్తము పన్నులభారము ఏవిధంగా పెరిగినదో పై లెక్కల వివరాలనుబట్టి తెలుసుకోవచ్చును. రెండవ ప్రణాళికాకాలములో అదనపు పన్నులద్వారా వసూలుచేసిన మొత్తాన్ని లెక్కగట్టు పలయు నన్న, మొదటి ప్రణాళిక ఆఖరు సంవత్సరముతో (1955 — 56 సంవత్సరముతో) పోల్చి చూడవలయును. ద్వితీయ ప్రణాళికా కాలములో మొత్తము వివిధపద్దుల క్రింద రు. 235.61 కోట్లు వసూలు చేశారు. (ఈ సంవత్సరము వసూలు చేయబోయే మొత్తముతో) ఇందులో ద్వితీయ ప్రణాళికాకాలములో రూ. 82.54 కోట్లు అదనపు పన్నుల ద్వారా వసూలు చేశారు.

మొదటి ప్రణాళిక ఆఖరు సంవత్సరము 1955 — 56 కంటె రెండవ ప్రణాళిక మొదటి సంవత్సరము రు 5.54 కోట్లు (18%) రెండవ సంవత్సరము రు 14.55 కోట్లు (47.5%), మూడవ సంవత్సరము రు 17.39 కోట్లు (56.8%) నాల్గవ సంవత్సరము రు 22.70 కోట్లు (74.1%). అయిదవ సంవత్సరము రు. 22.36 కోట్లు (72.9%) అదనపు పన్నులద్వారా వసూలు చేశారు.

కాన ద్వితీయ ప్రణాళికాకాలములో పన్నుల భారము మొదటి సంవత్సరముకంటె ప్రతి సంవత్సరము ఏవిధంగా పెరిగినదో అర్థమవుతుంది.

మన రాష్ట్ర ద్వితీయ ప్రణాళికకు కావలసిన వనరులను లెక్కలువేసే సందర్భములో కేంద్రం అదనంగా విధించే పన్నుల ద్వారా, రాష్ట్ర ప్రభుత్వము అదనంగా విధించే పన్నులద్వారా ద్వితీయ ప్రణాళికాకాలములో (5 సం॥లో) మొత్తం రు. 14.5 కోట్లు సేకరించాలని అంచనా వేశారు. అసెంబ్లీలో ఆర్థిక శాఖా మాత్యులు రెండవ ప్రణాళికా కాలంలో ఒక్క రాష్ట్ర ప్రభుత్వము విధించే కొత్తపన్నుల ద్వారానే రూ. 22.59 కోట్లు ఆదాయము రాగలదని చెప్పారు.

కాని బడ్జెట్ వివరాలను పరిశీలించిన యెడల ఆచరణలో ప్రజలనుంచి అదనంగా వసూలు చేయబడిన మొత్తము రూ 82 కోట్ల రూపాయలవరకు వున్నదని స్పష్టపడుతున్నది.

రెండవ ప్రణాళికాకాలములో అదనపు పన్నులద్వారా రాబట్టాలనుకున్న దానికంటే అయిదారు రెట్లు అదనంగా పన్నులు విధించి వసూలు చేశారు. ఈ పన్నులభారమంతా ప్రధానంగా సాధారణ ప్రజలపైన వేసినారనే విషయాన్ని ముందుగానే చూశాము. పోతే భూస్వాములు, పెద్ద ధనికులపై వేసినది చాలాతక్కువ. పైగా ఇదివరకు తెలంగాణాలో వ్యవసాయ ఆదాయపుపన్ను (ఆదాయమును బట్టి పన్ను విధించుపద్ధతి) చట్టాన్ని రద్దుచేశారు. జమీందారులకు నష్టపరిహారమిచ్చే చట్టాన్ని యీ సంవత్సరము సవరించి కొంత నష్టపరిహారాన్ని పెంచేందుకు ఏర్పాట్లు చేశారు.

ఇంతవరకు పన్నుల భారాన్నిగురించి చర్చించాము. ఇదిగాక ఇతర పద్దులనుంచి ఆదాయమన్న ఖాతాలో న్యాయ, విద్యా, వైద్య, ఆరోగ్య, పశుపోషణ శాఖల క్రింద, తదితరములు అనగా కార్మికశాఖ క్రిందవచ్చే ఆదాయములో చాలావరకు సాధారణ ప్రజలు చెల్లించేదే. వీటి క్రింద కోర్టుఫీజులు, ప్లీడర్ల ఫీజులు, ప్రభుత్వ కళాశాలలో ఫీజులు, వైద్యము చేసినందుకు మందులు అమ్మినందుకు, వెటర్నరీ కళాశాలలో ఫీజులు, లైసెన్సు ఫీజులు, కార్మికసంఘాల రిజిస్ట్రేషన్ ఫీజులు, ప్రభుత్వ పరీక్షలు (స్కూలుఫైనలు, సర్వీసు కమీషను మొదలగునవి) ద్వారాను పాతస్టోర్సు అమ్ముటద్వారా వచ్చే ఆదాయాలు

ఉన్నాయి. ప్రజలపై పన్నుల భారాన్ని గురించి ఆలోచించేటప్పుడు యీ భారాన్నికూడా కొంతవరకు దృష్టిలోకి తీసుకోవటము అవసర మనుకుంటాను.

## స్థా నిక సంస్థలు

ఆంధ్రప్రదేశ్‌లో స్థానికసంస్థలకు పన్నులరూపేణా వచ్చే ఆదాయం

| | (1958 లో) |
|---|---|
| 1. జిల్లాబోర్డులు (ప్రస్తుత పరిషత్తులు) | 4,66,79,164 |
| 2. మున్సిపాలిటీలు (ఆంధ్ర మాత్రమే) | 3,19,26,979 |
| 3. పంచాయితీలు | 1,91,29,121 |
| మొత్తం ... | 9,77,35,264 |

(1958–59 సం. ప్రభుత్వ పరిపాలనా నివేదిక నుండి)

ఆంధ్రప్రదేశ్ స్థానికసంస్థలపై ఆదాయము ప్రభుత్వగ్రాంటులు, లోన్సు తీసివేయగా వచ్చినది. అనగా ప్రజలదగ్గర స్థానిక సంస్థలు వసూలుచేసే మొత్తాలకు సంబంధించినది. 1958 లెక్కలు కావటము వలన ప్రస్తుత ఆదాయముకంటె చాలా తక్కువ వుంటుంది. కారణము ప్రస్తుతం రాష్ట్రంలోని అన్ని గ్రామాలకు పంచాయితీలు ఏర్పడ్డాయి. అప్పుడు చాలా కొద్దిమాత్రమే వుండేవి. ప్రస్తుతపంచాయితీలలో 3కోట్ల రూ॥వరకు వసూలు వుంటుందని అంచనా వేస్తున్నారు. తెలంగాణా మునిసిపాలిటీల బడ్జెటు లభించలేదు. అయితే ప్రభుత్వము స్థానిక సంస్థల కిచ్చే సెస్సుల వసూళ్ళు 1.5 కోట్లుకూడా ఇందులో వున్నాయి. కాని రాష్ట్ర ప్రభుత్వము వసూలుచేసే మొత్తములో ఈ 1.5 కోట్లను కలిపారు. కాన ఇచ్చట మొత్తం వసూళ్ళలో 1.5 కోట్లు తీసివేయాలి.

ప్రస్తుతము స్థానిక సంస్థలు వసూలుచేసే మొత్తము 12 మొదలు 13 కోట్ల వరకు వుంటుంది. కేంద్రము మొత్తము భారతదేశములో వసూలుచేసే 950 కోట్లలో ఆంధ్రప్రదేశ్ నుంచి ఎంత వసూలు చేస్తున్నారో వివరాలు లేవు. 80 నుండి 100 కోట్ల వరకు ఉండవచ్చునని నుకుంటాను.

# 4. భూసంస్కరణలు

భూసంస్కరణలు మన ఆర్థికవిధానములో చాలా ప్రాముఖ్యత వహిస్తాయి. భూసంస్కరణలను గురించి ప్లానింగు కమిషను యీ విధంగా చెప్పింది :

"ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలములో వివిధ ఆర్థికరంగములలో అవలంబించనున్న విధానాలు, కార్యక్రమములు, కీలకసమస్యలైన ఆర్థికాభివృద్ధి, సాంఘిక న్యాయములతో సమతూకములో సమన్వయము చేయబడవలయును. ఈ కార్యక్రమములలో భూసంస్కరణలకు ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నది. ఎందువల్లనంటే వ్యవసాయాభివృద్ధికి అవసరమైన సాంఘిక, ఆర్థిక, నిర్మాణ పరిస్థితులు కల్పించడానికి, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులైన పేదప్రజానీకపు జీవిత పరిస్థితులందు అవసరమైన మార్పులు తీనుకొని రావడానికి భూసంస్కరణలు ఎంతైనా తోడ్పడగలవు. భూసంస్కరణల ప్రభావము గ్రామీణ ఆర్థిక విధానముమీదనే గాక ఇతర రంగాలమీద కూడ వున్నది." (రెండవ ప్రణాళిక : 177 పేజీ)

"భూసంస్కరణలు రెండు ఆశయములు కలిగి యున్నవి. ఒకటి ఈనాడు దేశములో వ్యవసాయోత్పత్తికి ప్రతిబంధకంగానున్న భూమి అమరకపుపద్ధతి స్వభావమును మార్చుట; రెండు మన వ్యవసాయ ఆర్థిక విధానంలో నైపుణ్యంతో పెద్ద ఎత్తున ఉత్పత్తిని పెంచుటకు కావలసిన పరిస్థితులను కల్పించుట." (అదే పుస్తకం 178 పేజీ)

మన దేశంలో సత్వరం భూసంస్కరణలు తేవలసిన ప్రాముఖ్యత ప్లానింగు కమీషన్ తెలియజేసింది. సరైన భూసంస్కరణలు అమలు

జరిగితేగాని మన ఆర్థికవిధానంలో అభివృద్ధికరమైన మార్పులు రావు. దేశంలో ఆహారోత్పత్తి పెరగాలన్నా, మన ప్రాజెక్టులు నిర్మించబడి లక్షలకొలది యకరములభూమి సత్వరం సాగులోకి రావాలన్నా భూసంస్కరణలు అతి కీలకమైన సమస్యగా నున్నది.

మన రాష్ట్రంలో వ్యవసాయయోగ్యముగా లక్షలకొలది ఎకరాల భూమి వున్నది. వ్యవసాయ యోగ్యమైన బంజర్లు 41 లక్షల ఎకరాలున్నాయి. అంతేగాక, సరైన వసతులులేక ఒకసారి సాగు చేసి కొంతకాలం వదలి మరల సాగుచేసే పడావులు, మరియు గత సంవత్సరం సాగుచేసి వదలిపెట్టిన పడావులు 35 లక్షలు, ఒక సంవత్సరమునకు పైన అయిదు సంవత్సరములకు లోపు సాగుచేయకుండా వదలిన పడావులు 17 లక్షలూ మొత్తం 72 లక్షల ఎకరాల భూమి వున్నది. కాబట్టి ఏ కారణంచేతనైతేనేమి అసలు సాగుకాకుండాను, అప్పుడప్పుడు సాగుకాకుండాను వున్నటువంటి బంజర్లు, పడావులు, మొత్తం 113 లక్షల ఎకరాలవరకు వున్నది.

ఇవిగాక ప్రస్తుతం వ్యవసాయంక్రింద 270 లక్షల ఎకరముల భూమి వున్నది. ఈ భూమి సాగుఅవుతున్నా సాధారణంగా ఉత్పత్తిలో చెప్పుకోదగిన అభివృద్ధిలేకుండా వున్నది.

గ్రామసీమల్లో లక్షలకొలది నిరుద్యోగులున్నారు. వ్యవసాయ కార్మిక విచారణ రిపోర్టు ప్రకారము పరిస్థితి యీక్రిందివిధముగా నున్నది.

గ్రామీణజనాభాలో నూటికి 30.4 మందిభూమిలేని, లేదా సెంటో కుంటో వున్న వ్యవసాయకార్మికులున్నారు. ఇందులో నూటికి 85 మంది రోజువారికూలీలు. వీరికి సంవత్సరములో 189 రోజులు వ్యవసాయ పనులు, 29 రోజులు యితర పనులు లభిస్తాయి.

జాతీయ శాంపుల్ సర్వే ప్రకారము రైతులలో నూటికి 55 మంది కుటుంబాలు 5 ఎకరములు, అంతకు తక్కువ భూమి కలిగిన పేద రైతులు.

మన రాష్ట్రములో వ్యవసాయముమీద ఆధారపడేవారిలో వ్యవసాయ కార్మికులు 37 లక్షల 55 వేలు, కౌలుదారులు 24 లక్షల 13 వేలమంది వున్నారు. వ్యవసాయ కార్మికులలో కొందరికి పనిలేక, ఉన్నవారికి సంవత్సరములో సంగం రోజులుమాత్రమే పనివుండి తక్కినరోజుల్లో పనిలేక నిరుద్యోగులుగా వుంటున్నారు.

మన రాష్ట్ర ప్రజల జీవనోపాధికి ప్రధానమైన ఈ రంగములో ఒక ప్రక్కన సాగుచేయకుండావున్న లక్షల యకరాల బీళ్లు. రెండో వైపున పనిలేక ఆకలితో బాధపడే నిరుద్యోగులు. ఈ ప్రధాన వైరుధ్యమును తొలగించకుండా వీరందరికి భూమియిచ్చి సాగుచేయించకుండా మన ఆర్థికసమస్యలు పరిష్కారము కావనేది స్పష్టము.

ఈ కీలక సమస్య పరిష్కారమైతేనే దేశములో ప్రాజెక్టులు నిర్మించి లక్షలకొలది యకరాలు సాగులోకి తేవాలన్నా, అధిక ఆహారోత్పత్తి జరగాలన్నా సాధ్యమవుతుంది.

ప్లానింగు కమిషన్ ఈ ప్రాముఖ్యతను గురించి నొక్కి చెప్పింది. కాని మన రాష్ట్రములో ఈ సమస్యపై రెండవ ప్రణాళికా కాలములో జరిగినదేమిటో క్లుప్తంగా పరిశీలిద్దాము.

పడావులుగాక ప్రభుత్వాధీనములోనున్న బంజరు భూములే 35 లక్షల ఎకరములున్నవి. బంజర్లు పంపకము చేయాలని ఎంతోకాలంగా ఆందోళన చేస్తూవచ్చాము. 1954 నుంచి 7 సంవత్సరముల కాలములో ప్రభుత్వము 7 లక్షల 13 వేల ఎకరాలు మాత్రము పంచిపెట్టినది. ఇంకా సుమారు 30 లక్షల ఎకరములు పంపకము చేయాల్సి వున్నది.

రాజకీయ బాధితులపేరుతో 25 వేల ఎకరముల భూమి నిచ్చారు. ఇతరత్రా జీవనాధారము లేని పేద రాజకీయ బాధితులకు ప్రభుత్వ భూము లివ్వడంలో ఎవరికీ ఆక్షేపణ ఉండదు. కాని రాజకీయ బాధితులనే పేరుతో అన్ని రకాల ఆర్థిక హంగులున్న ధనవంతులకు కూడా భూములు కట్టపెట్టారు. అనేక సందర్భాలలో చాలా సంవత్సరములనుండి ప్రభుత్వ భూములను సాగుచేస్తున్న భూమిలేని పేద సాగుదారులను తొలగించి వారికి భూములను ఇచ్చినారు.

ఫీల్డు లేబరు కో-ఆపరేటివు సొసైటీలక్రింద అనేక సంవత్సరాల నుండి పేద వ్యవసాయ కూలీలు సాగుచేసుకుంటున్న లంకభూములలో మూడవవంతు తీసి పశువుల మేత పేరుతో వేలంవేసి భూస్వాములకు అప్పచెప్పారు.

ఆంధ్రప్రాంతములో అసమగ్రమైన కౌలుదారీ చట్టముతెచ్చి కౌలుదారులను భూములనుండి వెళ్ళగొట్టుటకు భూస్వాములకు మార్గము సుగమం చేశారు. ప్రస్తుతం శాసనసభముందున్న భూసంస్కరణల చట్టంలో ఖర్చులు ఉత్పత్తిలో సగము వుంటాయని చెప్పారు. కాని ఆంధ్ర కౌలుదారీ చట్టములో కౌలురేటు ఉత్పత్తిలో సగము ఉండాలని పెట్టారు. 'మరి మీ లెక్కల ప్రకారము సగము ఖర్చులు, సగము కౌలు పోతే రైతుకు మిగిలేదేమిటయ్యా, అంటే సమాధానము చెప్పరు. ప్లానింగ్ కమీషన్ కౌలురేటు ఉత్పత్తిలో 20 నుండి 25 వంతులు మాత్రమే ఉండాలని సూచించింది.

ఇక భూసంస్కరణల విషయం చూద్దాం. ప్లానింగ్ కమిషను ఉపసంఘంవారు గరిష్ట పరిమితి 5 గురు గల కుటుంబానికి సంవత్సరమునకు రూ 3600 ల నికరాదాయము వచ్చే భూమిని వదలి మిగతా భూమిని వ్యవసాయ కార్మికులకు, పేదరైతులకు పంచాలన్నారు.

కాని మన రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం ఏమి చేస్తున్నది? మన రాష్ట్రములో ఒక భాగమైన తెలంగాణా ప్రాంతంలో రైతాంగం భూసంస్కరణలకై అనేక పోరాటాలు సల్పారు. అనేక త్యాగాలు చేశారు. తెలంగాణా ప్రజానీకం సల్పిన పోరాటాల ఫలితంగా ఆనాటి కాంగ్రెసు ప్రభుత్వం కౌలుదారీ చట్టాన్ని తెచ్చింది. రక్షిత కౌలుదారీ విధానాన్ని ప్రవేశపెట్టింది. లోపాలున్నప్పటికీ కౌలురేటు విషయంలోనూ బేదఖళ్ల విషయంలోనూ కొన్ని రక్షణలు చేకూర్చబడినవి.

ఈ హైద్రాబాదుచట్టంలో రు. 800 లు నికరాదాయము అనగా రు. 1600 లు మొత్తము ఆదాయము వచ్చే భూమిని కుటుంబ కమతంగా నిర్దేశించటం జరిగింది. మొత్తం ఆదాయంలో 50% నికరాదాయంగా తేల్చటం జరిగింది.

దీని ప్రకారం, గ్యారంటీ నీటి పారుదల వసతులుగల మాగాణి భూమి అయితే 6 యకరాలు, గ్యారంటీలేని నీటి పారుదల వసతులూ, ఊట కాల్వలూ వగైరాల క్రింద సాగయ్యే మాగాణిభూమి అయితే 9 యకరాలూ, నల్లరేగడ మెట్టభూమి అయితే 24 నుండి 30 యకరాలూ, చల్కా భూములైతే 36 నుంచి 60 యకరాలు కుటుంబ కమతంగా, ఆ చట్టంక్రింద ఏర్పడిన లాండ్ కమిషన్ నిర్ధారణ చేసింది.

ఇటువంటి కుటుంబ కమతానికి $4\frac{1}{2}$ రెట్లుగా, రు. 3600 లు నికరాదాయం (రు. 7200 లు మొత్తం ఆదాయం) వచ్చే భూమిగా సీలింగు నిర్ణయింపబడింది.

కొద్దివేల యకరాల పండ్లతోపులు మినహా, మినహాయింపు క్రిందకువచ్చే భూములు దాదాపు లేనేలేవని ప్రభుత్వం ప్రకటించింది.

రక్షిత కౌలుదార్లు ఒక కుటుంబ కమతం మేరకు భూమిని తాము చెల్లించే కవులుకు, మెట్టభూమి అయితే 15 రెట్లు, మాగాణి భూమి అయితే 6 నుండి 8 రెట్లు చెల్లించి, తక్కువధరకు కొనుక్కునే హక్కు కల్గించబడింది.

హైద్రాబాదు రాష్ట్రంలోని భూస్వాములు, ప్రభుత్వం ముందు చేసిన ప్రకటనలనుబట్టి మొత్తం రాష్ట్రంలో, రక్షిత కౌలుదార్ల క్రింద 18 లక్షల యకరాలు, దరిమిలా రక్షిత కౌలుదార్లుగా చేయబడిన మామూలు కౌలుదార్ల క్రింద 23 లక్షల యకరాలూ భూమి వున్నట్లు తేలింది. ఈ మొత్తం భూమిలో దాదాపు 50% భూమి తెలంగాణాలో వున్నట్లు యెంచవచ్చును.

దీనికితోడు రెవిన్యూబోర్డు తయారుచేసిన ప్రకటన ప్రకారం తెలంగాణాలోనే 6,53,089 యకరాల మెట్టభూమికి సమానమయిన భూమి పంపకానికి లభ్యంకాగలదని తేలినది.

చట్టంలోని ప్రధానాంశాలు యివి. కాని యీ చట్టాన్ని యింత వరకూ అమలు జరుపలేదు.

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో 1960 లో యీ చట్టాన్ని రద్దుచేసి కొత్త భూసంస్కరణల చట్టాన్ని ప్యాస్ చేశారు. ఈ చట్టం ప్రకారము భూమిని తరగతులుగా విభజించి సీలింగు నిర్ణయించారు.

| భూముల వర్గీకరణ | కుటుంబ సభ్యునికి ఎకరాలలో | కుటుంబానికి ఎకరాలలో | రిమార్కులు |
|---|---|---|---|
| 'ఎ' తరగతి (గ్యారంటీమాగాణి) | 6 | 27 | ఇటువంటి |
| 'బి' తరగతి ,, | 8 | 36 | భూములు అతి స్వల్పము. |
| 'సి' తరగతి ,, | 10 | 45 | |
| 'డి' తరగతి ,, | 12 | 54 | |
| 'ఇ' తరగతి (గ్యారంటీలేని నీటి వనర్ల క్రింద మాగాణి) | 24 | 108 | |
| 'ఎఫ్' తగగతి (మెట్ట) | 36 | 162 | |
| 'జి' తరగతి ,, | 48 | 216 | |
| 'హెచ్' తరగతి ,, | 72 | 324 | |

ఈ ఎకముల పద్ధతిని ఆదాయములో చూచినపుడు రు. 5400 మొదలు రు. 10,800/-ల వరకు నికరాదాయము లేదా రు. 10,800/- నుండి రు. 21,600/-ల వరకు మొత్తము ఆదాయమువరకు సీలింగు పరిమితిని నిర్ణయించారు.

ప్రతీ వ్యక్తీ సీలింగు మేరకు భూమిని వుంచుకోవచ్చును. ఇందు మూలంగా 5 గురు సభ్యులున్న ఒక కుటుంబము సీలింగుకు 5 రెట్లు భూమిని అనగా రు. 45,000/- ల నుండి 54,000/- ల నికరాదాయాన్నిగాని, 90,000 నుండి రు. 1,08,000 మొత్తం ఆదాయంగా వచ్చే భూమిని కలిగివుండవచ్చును.

ఇదిగాక ప్రతి వ్యక్తి పశువుల మేతక్రింద సీలింగు ఏరియాలో 1/3 వంతు భూమిని ఉంచుకోవచ్చును. సీలింగు అన్వయించకుండా, కాఫీ, రబ్బరు, టీ, అన్నిరకాల పండ్లతోటలు, చెరకు ఫ్యాక్టరీల క్రింద నున్న చెరకుతోటలు, సమర్థవంతంగా నడుపబడే వ్యవసాయ భూములూ, సహకారసంఘాల క్రిందనున్న క్షేత్రాలూ అన్నీ మినహా యింపబడ్డాయి.

ఇన్ని చేసినతర్వాతకూడా ఎవరికైనా భూములు జాస్తీవుంటే చట్టము గెజటులో ప్రకటింపబడే లోపల అమ్ముకోవచ్చును.

ఈ చట్టము ప్రకారము ఆంధ్రప్రదేశ్‌లో ఎవరిదగ్గర భూమి సీలింగు పరిమితికి మించిఉండదు. కేవలము భూసంస్కరణలను హాస్యాస్పదంగా తయారుచేసిన చట్టము యిది.

దేశంలో ప్రజలు న్యాయమైన భూసంస్కరణలు కోరుతున్నారు. 5 గురుగల కుటుంబమునకు రు. 3600 నికరాదాయము వచ్చు భూమిని వుంచి తక్కినది వ్యవసాయ కార్మికులకు, పేద రైతాంగానికి పంపకం చేయాలని, చట్టంలో యెలాంటి భూములు మినహాయింపు ఉండరాదని కోరుతున్నారు. కాని ప్రస్తుతపు చట్టం ఈ న్యాయమైన కోర్కెకు పూర్తిగా వ్యతిరేకంగానున్నది. అంతేగాక, తెలంగాణాలో యింతవరకు రైతాంగము సాధించుకున్న చట్టాన్ని, ప్లానింగు కమిషన్ చేసిన సూచనలను కూడా నిరాకరిస్తోంది.

మనది వ్యవసాయదేశము. జనాభాలో ప్రధాన భాగము వ్యవసాయముపై ఆధారపడివున్నారు. మన రాష్ట్రములో యింతకుముందే చూపినట్లు లక్షలకొలదీ సాగుచేయబడని బంజర్లు, పెద్ద భూస్వాముల క్రింద రు. 3600 నికరాదాయముకన్న పైనఉన్న లక్షల యకరాలను— పనిలేకుండా వున్నటువంటి కొంతకాలం మాత్రమే పనిగలిగి తక్కిన—కాలములో నిరుద్యోగులుగా నున్నటువంటి, వ్యవసాయ కార్మికులు, పేద రైతాంగానికి పంపకము చేసినప్పుడే ఈ నిరుద్యోగ సమస్యను పరిష్కరించటానికి అవకాశ మేర్పడుతుంది. అప్పుడే దేశములో ఉత్పత్తి జయప్రదంగా అభివృద్ధి అవుతుంది. ఇది చేయకుండా కేవ

లము కోస్సి మంచి విత్తనాలు, ఎరువులద్వారానే మనకు కావలసిన ఆహారధాన్యాలు ఉత్పత్తి చేయలేమనేది స్పష్టము. ఈ విషయమును మనం ఆచరణలో చూస్తున్నాము.

ప్రాజెక్టుల క్రిందనున్న లక్షలయకరములను వెంటనే సాగులోకి తేవాలంటే ముందు యీ పనిజరగాలి. అప్పుడే మనకున్న నీటిని సద్వినియోగము చేసుకొని బీడు భూములను ఎక్కడికక్కడ సాగుచేసి అధికోత్పత్తి సాగించగలము. వ్యవసాయముమీద ఆధారపడిన యీ లక్షలకొలది పేదప్రజల జీవనప్రమాణము పెరుగుతుంది. పారిశ్రామిక వస్తువుల వినియోగము విస్తృతమవుతుంది. పరిశ్రమలు అభివృద్ధి కావటానికి అవకాశ ముంటుంది.

రాష్ట్రములో సక్రమమైన భూసంస్కరణలు అమలుజరిగినప్పుడే సర్వతోముఖమైన అభివృద్ధికి పునాది ఏర్పడుతుంది. ఈ సమస్యకు ఇలాంటి ప్రాముఖ్యత ఉండబట్టే ప్లానింగు కమిషన్ కూడా దీనిని నొక్కి చెప్పింది.

ప్రధాని నెహ్రూ యీ విధంగా చెప్పారు :

"ఎప్పుడైతే ఒక దేశము భూసమస్యను పరిష్కరించుకో గలుగుతుందో అప్పుడే ఆ దేశములో కష్టాలు తగ్గి ఇతరసమస్యలు వాటంతటవే పరిష్కరించబడుతాయి. ఇదే చరిత్ర చెప్పిన సత్యము"

(ఆధారము – హైద్రాబాదు భూసంస్కరణల సీరిస్ 12 నుండి)

మన జాతీయ ఆర్థికాభివృద్ధికి కీలకమైన భూసంస్కరణలను అమలు జరుపటానికి కాంగ్రెసు ప్రభుత్వాలు నిరాకరిస్తున్నాయి. అందువలన తక్కిన రంగాల్లో సరైన అభివృద్ధి జరుగుట అసాధ్యమనేది మన అనుభవము చెప్తోంది.

# 5. నీటి పారుదల

"మన రాష్ట్రానికి నదీజలసంపద సమృద్ధిగా ఉంది. ఇతర రాష్ట్రాలనుంచి మన రాష్ట్రంలోకి నదులు ప్రవహిస్తాయి కాబట్టి, ఆయా రాష్ట్రాల్లో వినియోగమయ్యే నీటిని మినహాయించి లెక్కించాలి. అలా లెక్కవేసి నప్పటికి మనకు సుమారు 10 కోట్ల ఎకరపుటడుగుల జలసంపద ఉన్నది. అయితే యిందులో యింతవరకు మనము 2 కోట్ల 60 లక్షల ఎకరపుటడుగుల నీటిని మాత్రమే వినియోగించుకో గలుగుతున్నాం. 67 లక్షల 88 వేల ఎకరాల భూమికి మాత్రమే సాగుకు నీరు లభిస్తోంది. ఇక ఇప్పుడు మనం వాడుకోలేకుండా వున్న 7 కోట్ల 40 లక్షల ఎకరపుటడుగుల నీటితో తేలిగ్గా 1 కోటి 40 లక్షల యకరాల ఎండి బీటలువారిన మెట్ట భూమిని సాగుచేసుకొన గలుగుతాం. అంటే 79 లక్షల టన్నుల ఆహార ధాన్యాలను మనం పండించ గలుగుతాం."

మనకున్న జలాధారాలను గురించిన వివరాలు :

| | | | |
|---|---|---|---|
| 1. | నాగార్జునసాగర్ కుడి, ఎడమ వైపు కాల్వలు | 3.2 | మిలియన్ల ఎకరాలు |
| 2. | సిద్ధేశ్వరం ప్రాజెక్టు శ్రీశైలం | 1.2 | ,, |
| 3. | పులిచింతల ప్రాజెక్టు | 0.6 | ,, |
| 4. | పోచంపాడు ప్రాజెక్టు | 1.8 | ,, |
| 5. | ఇంచంపల్లి ప్రాజెక్టు | 0.7 | ,, |
| 6. | రామపాదసాగర్ – ఇప్పూరు ఆనకట్ట – పోలవరం బ్యారేజి | 2.6 | ,, |
| 7. | వంశధార ప్రాజెక్టు | 0.3 | ,, |
| 8. | ఇతర మధ్యరకం పథకాలు చిన్నరకం పథకాలు | 1.6 | ,, |
| | మొత్తం | 12.0 | లేక 1 కోటి 20 లక్షల ఎకరాలు |

(పబ్లిక్ వర్క్సు శాఖామాత్యుల అసెంబ్లీ ఉపన్యాసమునుండి)

దీనినిబట్టి మన ఆంధ్రప్రదేశ్‌లో ఎంత జలసంపద ఉన్నదో అర్థమవుతుంది. ప్రస్తుతము 67 లక్షల 88 వేల ఎకరాలకు మాత్రమే నీటిసాగు లభిస్తుంది. ఇంకా 1 కోటి 20 లక్షల ఎకరాలకు సరిపోయే నీరు మనకున్నది. అంటే మనము సుమారు మూడింట ఒకవంతు నీటిని మాత్రమే ఉపయోగించుకోగలుగుతున్నాము.

"ఆంధ్ర ప్రాంతములో నీటి సాగుక్రిందనున్న భూమి, తలసరి సగటున 25 సెంట్లు వున్నది. తెలంగాణాలో 16 సెంట్లు. మొత్తము రాష్ట్రానికే సగటున తలసరికి 22 సెంట్లు మాత్రమే ఉన్నది. కనీసము యీ సగటు కమతము 50 సెంట్లయినా అనగా అర ఎకరమైనా వుంటే మంచిది. యీ లక్ష్యాన్ని సాధించాలంటే సుమారు రూ 580 కోట్లయినా కావాలి. ఇప్పటికి మన డబ్బు కేటాయింపుల లెక్కన, ఇంత మొత్తాన్ని సేకరించటానికి మనకు దాదాపు 40 సంవత్సరాలు పట్టేటట్టు ఉంది."

(మంత్రిగారి అదే ఉపన్యాసమునుండి)

అంటే ఇప్పుడున్న నీటిసాగు భూమికి రెండింతలు చేయాలంటేనే రూ. 580 కోట్లు అవసరం; 40 సంవత్సరాలవుతుంది.

మొత్తము మన రాష్ట్రంలోనున్న జలసంపదను పూర్తిగా వినియోగంలోనికి తేవాలంటే యింకా ఎక్కువ డబ్బు కావలసివుంటుంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కేంద్ర ప్రణాళికా సంఘానికి పంపిన బృహత్తర పథకం ప్రకారం గోదావరి, పెన్నారు, వంశధార, కృష్ణా తదితర నదీ జలాలను వినియోగంలోనికి తేవడానికి 650 కోట్ల రూపాయలు కావలసి వుంటుంది. యీ పథకం ప్రకారం 1 కోటి 41 లక్షల 29 వేల ఎకరాలకు నీటి సౌకర్యాలు లభిస్తాయి. ప్రస్తుత పద్ధతినే ఖర్చు పెట్టినచో 45,50 సంవత్సరాలు పడుతుంది

ఈ డబ్బు ప్రధానంగా ప్రాజెక్టులు కట్టటానికే సరిపోతుంది. లక్షల యకరాలు కొత్తగా సాగులోకి రావాలన్నప్పుడు – అది సకాలములో సాగులోకి రావాలన్నప్పుడు – ఇంకా ఎంతో డబ్బు అవసరం. అలా డబ్బు సమకూర్చుకోక పోతే ప్రాజెక్టులు నిర్మించికూడా నీటిని సద్వినియోగము చేసుకోలేక నష్టపోవలసి వస్తుంది.

"ఇది ఇలా వుండగా, అంటే నీటి వినియోగం ఒక పక్క సరి పడినంతగా లేకుండా వున్నప్పుడు మరోపక్కన వరదల తాకిడి అనేది ఒకటి వుంది. డెల్టా ప్రాంతాల్లో వరదల దెబ్బ జాస్తి. యీ వరదలను నివారించటానికిగాని, లేదా చాలవరకు అదుపులోకి తెచ్చుకోవటానికి గాని రూ. 60 కోట్లు ఖర్చు అవుతుంది."

(మంత్రిగారి ఉపన్యాసమునుండి)

కొత్త ప్రాజెక్టుల నిర్మాణము, మరియు వరదల నివారణ, మురుగు సమస్య మొదలైన మన నీటిపారుదల సమస్య బృహోత్తరమైనది. కోట్లకొలది రూపాయలు అవసరము. కాని మన ప్రణాళిక కేటాయింపులు చూచినప్పుడు ఇవన్నీ సాధించుటకు ఎంతకాలము పడుతుందో ఊహించుట కష్టము. నీటి పారుదలకు రెండవ పంచవర్ష ప్రణాళికలో కేటాయింపుఖర్చులు చూపు వివరమైన పట్టిక క్రింద యిస్తున్నాను.

(లక్షల రూపాయలలో)

| | రెండవ పంచవర్ష ప్రణాళికలో కేటాయింపు | మొదటి నాలుగు సంవత్సరాలలో ఖర్చు | 1960–'61 సంవత్సరానికి కేటాయింపు |
|---|---|---|---|
| **బహుళార్థక ప్రాజెక్టులు :** | | | |
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు | 3699.81 | 2799.81 | 900.00 |
| **ఆంధ్ర–మేజర్ ప్రాజెక్టులు :** | | | |
| కృష్ణా బారేజి స్కీము | 120.65 | 110.57 | 10.08 |
| రొంపేరు డ్రైనేజి స్కీము | 2.76 | 2.76 | ... |
| భైరవానితిప్ప ప్రాజెక్టు | 110.22 | 108.99 | 1.23 |
| అప్పర్ పెన్నార్ ప్రాజెక్టు | 33.29 | 33.57 | (–)0.28 |
| రాళ్లపాడ్ ప్రాజెక్టు స్టేజి 2 | 30.09 | 30.27 | (–)0.18 |

| | | | |
|---|---|---|---|
| టి. బి. పి. లోలెవెల్ కెనాలు | 85.63 | 70.74 | 14.89 |
| టి. బి. పి. హైలెవెల్ కెనాలు | 206.58 | 72.89 | 133.69 |
| వంశధార ప్రాజెక్టు | 49.78 | 39.78 | 10.00 |
| ప్రాజెక్టుల పరిశోధనలు | 5.00 | 1.00 | 4.00 |
| | 644.00 | 470.57 | 173.43 |

**మీడియమ్ ప్రాజెక్టులు :**

| | | | |
|---|---|---|---|
| నారాయణపురం ఆనకట్టస్కీము | 52.93 | 45.43 | 7.50 |
| నాగవల్లి కుడివైపు కాలువ | 9.42 | 9.32 | 0.10 |
| వేగవతి ఆనకట్ట స్కీము | 13.83 | 13.25 | 0.58 |
| సీతాగనరం ఆనకట్ట స్కీము | 6.57 | 6.42 | 0.15 |
| గంభీరంగడ్డ రిజర్వాయర్ | 5.87 | 5.87 | ... |
| రీమోడలింగు బందకట్టు ఛానల్ | 0.63 | 0.48 | 0.15 |
| నక్కలగండి రిజర్వాయరు | 0.70 | 0.63 | 0.07 |
| పాలేరు రిజర్వాయర్ స్కీము | 1.22 | 1.12 | ... |
| ఉప్పుటేరు లోయర్ ఆనకట్ట | 2.24 | 2.24 | ... |
| కలంగి రిజర్వాయర్ | 19.32 | 19.27 | 0.05 |
| మల్లిమడుగు ప్రాజెక్టు | 12.92 | 12.87 | 0.05 |
| లోయర్ సాగిలేరు ప్రాజెక్టు | 26.73 | 27.78 | (-)1.05 |
| పింఛ ప్రాజెక్టు | 19.81 | 20.81 | (-)1.00 |
| సిద్ధలగండి ప్రాజెక్టు | 3.09 | 2.99 | 0.10 |
| విద్యారణ్యస్వామిగుడి ప్రాజెక్టు | 0.33 | 0.03 | ... |
| చెన్నరాయస్వామిగుడి ప్రాజెక్టు | 16.57 | 15.82 | 0.75 |
| కె. సి. కెనాలు మై. $\frac{6}{4}$ నుండి చివరవరకు అభివృద్ధి మరియు రీమోడలింగ్ కొరకు | 380.60 | 358.60 | 22.00 |
| | 572.68 | 543.23 | 29.45 |

**కొత్తమీడియమ్ ప్రాజెక్టులు :**

| | | | |
|---|---|---|---|
| తొర్రిగెడ్డ పంపింగ్ స్కీము | 10.98 | 4.98 | 6.00 |
| పాలేరు బిట్రుగుంట సప్లయి ఛానలు త్రవ్వకానికి | 15.90 | 9.90 | 6.00 |
| పైడిగమ్ ప్రాజెక్టు | 9.03 | 2.53 | 6.50 |
| వట్టిగడ్డ ప్రాజెక్టు | 2.00 | ... | 2.00 |
| వరహా రిజర్వాయర్ | 0.30 | 0.20 | 0.10 |
| గంతవారి కొత్తగూడెం ప్రాజెక్టు | 12.23 | 2.23 | 10.00 |
| స్వర్ణముఖి ఎడమకాలువ | 1.10 | 0.10 | 1.00 |
| కళ్యాణి రిజర్వాయర్ | 1.10 | 0.10 | 1.00 |
| బాహుదా రిజర్వాయర్ | 1.10 | 0.10 | 1.00 |
| జుర్రేరు రిజర్వాయర్ | 9.40 | 3.40 | 6.00 |
| వరదరాజస్వామి ప్రాజెక్టు | 0.50 | ... | 0.50 |
| డొంకడ ఆనకట్టు | 12.00 | 2.00 | 10.00 |
| పంప రిజర్వాయర్ | 2.00 | ... | 2.00 |
| కనపూర్ కెనాల్ స్కీము | 10.00 | 5.00 | 5.00 |
| | 84.64 | 30.54 | 57.10 |

**తెలంగాణా మేజర్ ప్రాజెక్టులు :**

| | | | |
|---|---|---|---|
| రాజోలిబండ డైవర్షన్ స్కీము | 175.24 | 135.24 | 40.00 |
| కడెం ప్రాజెక్టు | 201.84 | 151.84 | 50.00 |
| పోచంపాడు ప్రాజెక్టు | 65.00 | 25.00 | 40.00 |
| ప్రాజెక్టుల పరిశోధనలు | 15.79 | 13.19 | 2.60 |
| | 457.87 | 325.27 | 32.60 |

మీడియం ప్రాజెక్టులు

(స్పిలోవర్)

| | | | |
|---|---|---|---|
| కోయిల్‌సాగర్ ప్రాజెక్టు | 4.87 | 3.49 | 1.38 |
| భీమనపల్లి ప్రాజెక్టు | 0.56 | 0.36 | 0.20 |
| సరళసాగర్ ప్రాజెక్టు | 16.79 | 15.79 | 1.00 |
| మూసీ ప్రాజెక్టు | 184.34 | 154.34 | 30.00 |
| శిర్ల ప్రాజెక్టు | 1.87 | 1.51 | 0.36 |
| | 208.43 | 175.49 | 32.94 |

కొత్తమీడియం ప్రాజెక్టులు :

| | | | |
|---|---|---|---|
| జూటిపల్లి ప్రాజెక్టు | 11.34 | 6.34 | 5.00 |
| లక్నాపూర్ ప్రాజెక్టు | 5.00 | 1.00 | 4.00 |
| స్వర్ణ ప్రాజెక్టు | 12.00 | 5.00 | 7.00 |
| సలివాగు ప్రాజెక్టు | 1.60 | 0.10 | 1.50 |
| నల్లవాగు ప్రాజెక్టు | 0.10 | ... | 0.10 |
| రామడుగు ప్రాజెక్టు | 2.00 | 0.50 | 1.50 |
| చినమూసిర్ ప్రాజెక్టు | ... | ... | ... |
| నక్కలవాగు ప్రాజెక్టు | 0.10 | ... | 0.10 |
| లక్ష్మీసాగర్ ప్రాజెక్టు | ... | ... | ... |
| సుద్దవాగు ప్రాజెక్టు | 0.11 | 0.01 | 0.10 |
| లంకసాగర్ ప్రాజెక్టు | 1.51 | 0.01 | 1.50 |
| కోటిపల్లివాగు | 0.10 | 0.06 | 0.04 |
| మొత్తం | 2004.47 | 1558.11 | 446.36 |

(రెండవ ప్రణాళిక రివ్యూనుండి)

పట్టికలో చూపించిన విధంగా నాగార్జునసాగర్ ప్రాజెక్టు, పెద్ద ప్రాజెక్టులు, మధ్యరకం ప్రాజెక్టులు అన్నీకలసి మొత్తం 62 ఉన్నాయి. ఇందులో చాలా భాగము మొదటి ప్రణాళిక కాలములోను, రెండవ ప్రణాళిక ప్రారంభదశలోను తీసుకోబడినవి. ఇవన్నీ పూర్తి అయ్యి వీటి క్రింది భూములు పూర్తిగా సాగులోకి రావాలంటే ఎంత కాలము పడుతుందో చెప్పుట కష్టము.

ఇంతవరకు మన ప్రాజెక్టుల నిర్మాణము ఏవిధంగా సాగుతుందో చూశాము. ఇక పూర్తయిన ప్రాజెక్టుల క్రింద ఆయకట్టు అభివృద్ధి ఏ విధంగా సాగుతూందో చూద్దాము. ప్రాజెక్టులు నిర్మించిన తర్వాత వాటిక్రింద ఆయకట్టు అభివృద్ధిచేయు విషయములో ప్రభుత్వము సరియైన విధానము అవలంబించలేకపోతూంది. రెండవ ప్రణాళికాకాలంలో మొత్తము నీటిపారుదల అవకాశములను గురించి తెలుసుకుందాము.

"రెండవ ప్రణాళికాకాలంలో పెద్ద చిన్న మధ్యరకం పథకాలక్రింద అదనంగా సాగులోకి తేవాలని ఉద్దేశించిన భూమి ఆంధ్ర ప్రాంతంలో 7,44,360 యకరాలు వుంటుంది. ఇందులో 96,000 యకరాలు చిన్న పంటచెరువుల కిందివి. వీటిపై అజ్మాయిషీ రెవిన్యూశాఖది. మిగతా 6,48,360 ఎకరాల సాగుకు సంబంధించిన పథకాలను పబ్లిక్ వర్కుస్ శాఖ అమలు జరుపాలి. 1960–61 నాటికి 5.06 లక్షల ఎకరాల భూమిని సాగులోకి తేగలుగుతామని చెప్పవచ్చును. ఇలాగే తెలంగాణాలో అదనంగా 4,33,411 ఎకరాల భూమిని సాగులోకి తేవలసి వుంటుంది. 1959–60 చివరకు 2.15 లక్షల ఎకరాలభూమికి సాగునీరు లభిస్తుంది. అంటే రెండవ ప్రణాళిక చివరి సంవత్సరములో ఇంకా 2.18 లక్షల ఎకరాలను సాగులోకి తేవలసివుంటుంది. ఈ లక్ష్యాన్ని పూర్తిగాసాధించటానికి తగినప్రయత్నాలు జరుగుతున్నాయి"

(మంత్రిగారి అదే ఉపన్యాసము నుండి)

అంటే మొత్తము రెండవ ప్రణాళిక ఆఖరుకు ఆంధ్రలో 6,48,360 యకరాలు సాగులోకి తీసుకురావాలనుకుంటే 5,06000

ఎకరాలు మాత్రము సాగులోకి తెగలమని ఆశిస్తున్నారు. తెలంగాణాలో ౪,33,411 ఎకరాల భూమిని సాగులోకి తేవలసివుంటుంది. 1959–60 చివరకు 2.15 లక్షల ఎకరాల భూమికి సాగు లభిస్తుందని, ఆఖరు ఒక్క సంవత్సరంలో 2.18 లక్షల ఎకరాలను సాగులోకి తీసుకు రావాలని ఆశిస్తున్నామని చెపుతున్నారు. దీనినిబట్టి ఆంధ్రప్రదేశ్‌లో 11 లక్షల యకరాలకు నీటి వసతిని కలుగజేయాలనుకున్నదానికి 6,7 లక్షల యకరములకు నీటిసాగు ఏర్పాటు కలుగజేయవచ్చును. కాని నిజంగా భూమి ఎంత సాగులోకి వస్తుందనేది ముఖ్యమైన ప్రశ్న. గత అనుభవాన్నిబట్టి నీటి సాగుదల ఏర్పాట్లుచేయబడిన భూమి సాగులోకి ఎంత వస్తుందనేదే ప్రశ్న. పబ్లిక్ వర్క్స్ డిపార్టుమెంటువారు పంపిన లెటరు ప్రకారం 1959–60 (డిసెంబరు 1959) నాటికి ప్రణాళిక పెద్ద మధ్యరకం ప్రాజెక్టుల క్రింద ఆంధ్ర 2,43,553, తెలంగాణా 2,68,941 ఎకరాలు మాత్రం సాగులోకి తీసుకురాగలిగారు. అనగా ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికాకాలములో నిర్మించిన మొత్తము పెద్ద మధ్యరకము ప్రాజెక్టుల క్రింద 1959–60 (1959 డిసెంబరునాటికి) 5,12,494 ఎకరములు సాగులోకితేగలిగారు. 1959 మార్చి 31 వరకు పెద్ద మధ్యరకం ప్రాజెక్టుల క్రింద 3,00,000 యకరములు సాగులోనికి తీసుకురాబడినట్లు 3 వ ప్రణాళికలో చెప్పబడినది. 1956–57 లో 85,000 ఎకరాలు, 57–58 లో ఒకలక్ష ఎకరాలు మైనర్ ఇరిగేషన్ క్రింద సాగుకు అవకాశాలు కల్పించారు. కాని అంతకంటె ఎక్కువభూమి సాగుకావటానికి కావలసిన నీరు సమకూర్చబడినది. కాని తగిన ప్లాను ఏర్పాటులేనందున ఆ నీరంతటిని ఉపయోగంలోకి తేలేకపోయారు.

కొన్ని ఉదాహరణలు తీసుకుందాము. తుంగభద్ర దిగువకాలువ ద్వారా 1,48,725 ఎకరములు సాగులోకి రావలసి వున్నది. కాని ఈ క్రింది లెక్కలను చూచిన ఏ విధంగా నీటిని మనము ఉపయోగించుకోలేకపోయామో తెలుస్తుంది.

| సంవత్సరము | నీటిపారుదలకు కావలసిన నీటి నిల్వ | సాగుచేసిన భూమి | % |
|---|---|---|---|
| 54–55 | 30,000 | 3,576 | 11.9% |
| 55–56 | 75,000 | 16,229 | 21.6% |
| 56–57 | 116,500 | 20,632 | 17.7% |
| 57–58 | 148,725 | 39,909 | 27 % |
| 58–59 | 148,725 | 70,703 | |
| 59–60 | 148,725 | 100,000 | |

(తుంగభద్రప్రాజెక్టు 1945–48 నుండి 1959 లో ప్రభుత్వప్రకటితము)

(58–59, 59–60 కి సంబంధించి, రెవెన్యూబోర్డు మెంబరు వివరాలు ప్రకటించారు.—ఆంధ్ర పత్రిక)

కృష్ణాబ్యారేజి స్కీము పూర్తికాగానే దానిక్రింద కృష్ణాజిల్లాలో 92 స్కీములద్వారా 51,500 ఎకరములు, గుంటూరు జిల్లాలో 41 స్కీములద్వారా 47,775 ఎకరములు, మొత్తము 99,275 ఎకరములు సాగుకావలసియున్నది. కాని 1957–58 వరకు 11,576 ఎకరములు 58–59 లో 12,571 ఎకరములు సాగైనది. (1959 మార్చి 14 న అసెంబ్లీలో పి. డబ్ల్యు. డి. మంత్రిగారి సమాధానము) 1959–60లో షట్టర్సుతో సహా ప్రాజెక్టు పూర్తయినా, యింతవరకు సాగయ్యేది 12,571 ఎకరములే. ప్రస్తుతము ఈ సంవత్సరముకూడా ఆ కాలవలకు ఏమీ డబ్బు కేటాయించలేదు. అంటే సుమారు లక్ష యకరములు అదనపు సాగుకు నీరున్నా సాగయ్యేది 12,571 ఎకరములు మాత్రమే.

కె. సి. కెనాల్ కూడా యింతే. 1955 లో పని ప్రారంభించి 1958 లో పని పూర్తిచేశారు. పాతసాగు 1 లక్ష ఎకరాలు, కొత్తగా 2 లక్షలు, మొత్తం 3 లక్షల ఎకరములు సాగులోకి రావాల్సివున్నది. 1959 మేలో 1,15,000 సాగైనది. (పాత సాగుతోసహా) 1959 – '60 లో 1,70,000 సాగెనది. 1958 లో 3 లక్షల యకరములు

సాగుకావటానికి నీరుంటే 1959-60 నాటికి కూడా 1 లక్ష 70 వేల ఎకరాలు పాతసాగుతో కూడా కలుపుకొని సాగైనది.

మూసీ ప్రాజెక్టుక్రింద మొత్తము ఆయకట్టు 38000 ఎకరములు. 1958-59 లో 5000 ఎకరాలు సాగులోకి రావాల్సివుండగా 2884 ఎకరములు భూమిమాత్రము సాగైనది.

భీమిలిపట్నం ప్రాజెక్టుక్రింద మొత్తము 1860 ఎకరాలు ఆయకట్టు. 1958-59 లో 1100 ఎకరాలు సాగు కావాల్సి వుండగా ఏమీ సాగు కాలేదు.

దాదాపు అన్ని ప్రాజెక్టులలోను యిదే కనిపిస్తుంది. నీరు నిల్వ చేసిన తర్వాత ఆ నీటిని ఉపయోగించుకొనుటకు కావలసిన సరైన ఏర్పాట్లు చేయనందున నిల్వచేసిన నీటిని ఉపయోగించుకో లేకపోతున్నాము. దీనివలన లక్షలకొలది రూపాయల నీటితీరువా, లక్షల టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తి నష్టపోతున్నాము.

ప్రాజెక్టు నిర్మాణమునకు పూనుకోగానే దానికి తగినవిధంగా, ప్రాజెక్టుక్రింద భూములను వెంటనే సాగులోకి తీసుకొనివచ్చుటకు ఏర్పాట్లు చేయాలి. భూములకు నీరు తీసుకొనుటకు చిన్న కాలువలు త్రవ్వుటకు తగిన ఏర్పాట్లు, రైతాంగానికి అప్పులు ఆ ప్రాంతంలో ఆరోగ్యవసతులు, రోడ్డు వసతులు మొదలగునవన్నీ సకాలములో సమకూరుటకు ఏర్పాట్లు చేయాలి. అన్ని డిపార్టుమెంటులతో కలిపిన కమిటీలతో ఎప్పటికప్పుడు సమన్వయము చేయాలి. అన్నిటికంటె ముఖ్యము ప్రజల సహకారము తీసుకొనుట. ప్రజా ప్రతినిధులతో కమిటీలువేసి భూమిని ఆయా ప్రాజెక్టులక్రింద వెంటనే సాగులోకి తీసుకొనివచ్చుటకు ప్రజల నుత్సాహపరచే ఏర్పాట్లు చేయాలి.

ఇలాంటి మొత్తము ప్లాను లేనప్పుడు ప్రాజెక్టులు నిర్మించినా సరైన విధంగా వాటిక్రింద భూములు సాగులోకి తేలేక పోవటము జరుగుతుంది. ప్రభుత్వము దూరదృష్టితో యీ ఏర్పాటులు యింత వరకు సక్రమంగా చేయుటలేదు.

అన్నిటికంటే వెంటనే భూములు సాగులోకి రాకుండా పోవటానికి ముఖ్యకారణం, పందలకొలది ఎకరాల భూమి కొద్దిమంది భూస్వాముల చేతులలోవుండుటయే. ఈవిషయంలో తుంగభద్ర బోర్డువారు కూడా తమ అనుభవాన్ని ఇలా చెప్పారు :

"పెద్ద కమతాలను మెట్టసాగులోకి తీసుకరావడమే కష్టమైన పని అని అనుభవము చెప్పతోంది. కాని యీ కమతాలు మాగాణిగా సాగుచేయా లన్నప్పుడు ఇంకా కష్టమైనపని అవుతుంది."

అదేవిధంగా కె. సి. కెనాలు; అనుభవము చెపుతోంది. కె. సి. కెనాలు క్రింద పూర్వము నిర్దేశించ బడినట్లు ఆయకట్టు అభివృద్ధి కాకపోవటానికి కారణాలు పేర్కొంటూ, "వ్యక్తులు పెద్ద కమతాలను కలిగియుండి, కొద్దిగా మాత్రమే మాగాణి సాగులోకి తెచ్చుట" ఒక కారణంగా కె. సి. కెనాలు రిపోర్టులో పబ్లికువర్క్సు డిపార్టుమెంటువారు చెప్పారు.

ప్రాజెక్టులక్రింద యీ భూములను సకాలములో సాగులోకి తీసుకు రాకపోవటమునకు ప్రధాన కారణము భూమి కొద్దిమంది భూస్వాముల చేతుల్లో కేంద్రీకరించ బడుటయే ననేది స్పష్టము. దేశములో నిరుద్యోగులుగానున్న లక్షలకొలది వ్యవసాయ కార్మికులకు పేద రైతాంగమునకు భూమి నిచ్చినపుడు వారు శ్రమించి ఈ లక్షలకొలది ఎకరాలను అతిత్వరలో సాగులోకి తెస్తారు. పంటలు పండిస్తారు. కీలకమైన యీ సమస్యను పరిష్కరించకుండా పాతపద్ధతిలో ఈ భూములను సత్వరము సాగులోకి తేవటము సాధ్యమయ్యే విషయము కాదు.

ఇక ఈ స్కీములను ప్రభుత్వము అమలుపరచు విధానాన్ని పరిశీలిద్దాము.

నీటిపారుదల స్కీములక్రింద బడ్జెటులో అసెంబ్లీ ఆమోదము పొందిన తర్వాత అనేకస్కీములు మార్చబడుతున్నాయి. మొదట అసెంబ్లీలో ఆమోదింపబడిన స్కీములకు అనివార్య కారణాలవలన కొన్ని మార్పులుంటే అంగీకరించేసుకోవచ్చును. కాని పూర్తిమార్పులు

జరుగుతున్నాయి. ఉదాహరణకు 1958—59 బడ్జెటు అకౌంట్సు చూచి నచో మార్పుల ప్రాముఖ్యతఅర్ధముకాగలదు. మొత్తము 214 నీటిపారుదల పథకాలలో 77 పథకాల కేటాయింపులలో నూటికి 50 వంతులు, 24 పథకాల కేటాయింపులలో నూటికి 25 వంతులు, 34 పథకాల కేటాయింపులలో నూటికి 10 వంతులు మార్పుచేశారు. మొత్తము 214 పథకాలలో 135 పథకాలను మార్చారు. అంటే ఒక విధంగా మొదట బడ్జెటు ఆమోదించిన పథకాలలో జాస్తిభాగము మార్పులు జరిగాయి.

ఇందులో కొన్ని మార్పులు అనివార్య కారణముల వలన జరిగినను చాల భాగము అధికారపక్షముయొక్క అవసరాలకోసము మార్పుచేయబడినవనేది స్పష్టము.

బడ్జెటులో ప్రధానభాగం నీటి పారుదల, విద్యుచ్ఛక్తి స్కీముల క్రింద ప్రధాన భాగం ఖర్చుచేయబడుతుందన్న విషయం అందరికీ తెలిసినదే. కాని యీ డబ్బు అంతా సక్రమంగా ఖర్చు అవుతుందని చెప్పలేం. ముఖ్యంగా కంట్రాక్టర్సుకు లాభాలరూపంలో చాలా వెళ్తుంది. అంతేగాక అనేకమంది కంట్రాక్టర్సుకు ప్రభుత్వపక్షముతో సంబంధా లుండుటవలన, నిర్ణయించబడిన పద్ధతిలో ప్రాజెక్టులు నిర్మించుటలేదు.

కంట్రాక్టర్లు అధికలాభాలు సంపాదిస్తున్నారని, ప్రాజెక్టులు నిర్మించుటలో చాలాచోట్ల అవకతవకలు చేస్తున్నారన్న సంగతి అందరికీ తెలిసినదే.

ఈ సందర్భంలో కాంగ్రెసుపక్ష సభ్యుడు అధ్యక్షుడుగా, అన్ని పక్షాలు కలిసివున్న అంచనాల కమిటీయొక్క ఒకటి రెండు అభిప్రాయాలను తెలియజేస్తాను.

కదము ప్రాజెక్టు డాము, కాలువల నిర్మాణమునకు అంచనా వేసినప్పుడు జిల్లాలోవున్న షెడ్యూల్డు రేట్సుకంటే 100% అధికంగా వేయబడినది. కాని తీరా కంట్రాక్టర్సు కిచ్చేటప్పుడు 170% కు పెంచారు. అది టెండర్సు లేకుండానే కంట్రాక్టర్సుకు యిచ్చారు. ఈ విషయమై అంచనాలకమిటీ యీ విధంగా చెప్పింది :

"జిల్లా షెడ్యూల్డు రేట్లమీద 170% పెంచి అంచనాలను తిరిగి తయారుచేయుటవలన 70% పెరిగినది. డాము, కాలువల నిర్మాణమును కంట్రాక్టర్లకు యిచ్చే సందర్భంలో సాధారణంగా అవలంబించవలసిన టెండర్ల పద్ధతి అవలంబించనందున యీ పెరుగుదలకు ప్రాముఖ్యత వున్నది. అదేవిధంగా నిర్మల తాలూకాలోనున్న రేట్లనువదలి 10% జాస్తిగావున్న లక్సెట్టిపేట తాలూకా రేట్లను ఎందుకు తీసుకున్నారో కారణము కనపడదు. ఈ రెండు సందర్భాలలోను సమర్థనీయము గానటువంటి పెరుగుదల కన్పిస్తున్నది."

(పేజి 4, మొదటిపేరా, 5 వ రిపోర్టు 1957–58)

"అంత పెద్ద మొత్తమునకు సంబంధించిన డాముపనిని టెండర్లు పిలువకుండా లక్సెట్టిపేట రేట్లుకూడా కాకుండా జిల్లా షెడ్యూలు రేట్లకంటే 170% అధిక అంచనాలతో, ఒకేవ్యక్తికి ఇచ్చుటలో డిపార్టుమెంటు ఖచ్చితంగా తప్పు చేసినదనే కమిటీ అభిప్రాయ పడుతోంది."

(అదే రిపోర్టు, పేజి 6, మొదటిపేరా)

ఇదేవిధంగా అంచనాలకమిటీ అనేక ప్రాజెక్టులలో కంట్రాక్టర్లు ప్రభుత్వ వ్యవహారాలను గురించి తెలియజేశారు. స్థలాభావముచేత వాటిని యిచ్చుట పొందుపరచుటలేదు.

# 6. వ్యవసాయం

మన రాష్ట్రము ప్రధానంగా వ్యవసాయంపై ఆధారపడినదని వేరే చెప్పనవసరము లేదు. మొత్తము జనాభాలో నూటికి 67.3 మంది వ్యవసాయముమీద ఆధారపడి జీవిస్తున్నారు. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలములో యీ క్రింది విధంగా వ్యవసాయాభివృద్ధికి డబ్బు కేటాయించ బడినది.

మొత్తము అనిరకాల వ్యవసాయ పథకాలక్రింద 39 కోట్లు కేటాయించ బడినది. దీనిక్రింద పశుపోషణ, అడవులు, సహకారము, చిన్న నీటిపారుదల, భూసార సంరక్షణ, జాతీయ విస్తరణ కార్యక్రమము మొదలగునవన్నీ వున్నాయి. వ్యవసాయోత్పత్తికి సంబంధించి 6 కోట్ల 87 లక్షలు కేటాయించబడినది. జాతీయ విస్తరణ కేంద్రములక్రింద ఖర్చుపెట్టే 15 కోట్లలోను ముఖ్యమైన భాగము వ్యవసాయోత్పత్తి క్రిందకే వస్తుంది. వ్యవసాయోత్పత్తిక్రింద రూ 261 లక్షలు, జాతీయ విస్తరణ కేంద్రాలలో 481 లక్షలు మొత్తము రూ. 742 లక్షలు రైతులకు అప్పులు యిచ్చుటకుగాను కేటాయించ బడినది.

వ్యవసాయంలో నూతన పద్ధతులు కనిపెట్టుటకుగాను పరిశోధన సాగించుట, వ్యవసాయాభివృద్ధి, వ్యవసాయ ప్రవీణులను తయారు చేయుట, వ్యవసాయోత్పత్తులను నిల్వచేయుటకు కావలసిన గోదాములను నిర్మించుట, వ్యవసాయాభివృద్ధికి రసాయన ఇతర ఎరువులను గూర్చి ప్రచారము చేయుట మొదలగు కార్యక్రమములను వ్యవసాయ శాఖవారు తీసుకొని పనిచేస్తున్నారు. ఇవన్నీ వ్యవసాయాభివృద్ధికి చాలా ముఖ్యమైనవే.

మన పరిశోధనలు మొత్తంగా వ్యవసాయానికి చాలినంతగా లేవు. ఉన్నంతలో కూడ ప్రధానంగా మాగాణి పంటల పైననే జరుగుచున్నది. మెట్టపైర్ల విషయములో కూడా తగిన శ్రద్ధ తీసుకోవలసివున్నది. గట్టి ధాన్యములకు సంబంధించి జయప్రదమైన పరిశోధనలు సాగలేదు.

రసాయనిక, ఇతర ఎరువులు మన వ్యవసాయాభివృద్ధి కెంతో అవసరము. కాని మనకు తగినంత ఎరువులను కేంద్రం సప్లయి చేయుటము లేదు. ఈ క్రింది పట్టిక గమనించితే యీ విషయం బోధపడుతుంది.

## కేంద్రము నుండి ఆంధ్రప్రదేశ్‌కి అందజేయబడిన ఎరువుల పట్టిక

( అమోనియం సల్ఫేటు, యూరియా, అమోనియం సల్ఫేటు నైట్రేటు, కాల్షియం అమోనియం నైట్రేట్, సూపర్‌ఫాస్ఫేటు వగైరా )

| | 1956–57 | 1957–58 | 1958–59 | 1959–60 | 1960–61 |
|---|---|---|---|---|---|
| రాష్ట్రంకోరిన ఎరువుల మొత్తం | 116,590 | 146,000 | 178,000 | 203,350 | 231,800 |
| కేంద్రంచే కేటాయించబడిన మొత్తం | 83,140 | 130,950 | 104,674 | 124,505 | 81,813 |
| రాష్ట్రప్రభుత్వానికి అందిన మొత్తం | 69,328 | 119,952 | 92,432 | 100,731 | 47,230 |

(1) మొత్తం 5 సంవత్సరాల్లోను అడిగిన మొత్తం 8,75,740
(2) ,, ,, కేంద్రం కేటాయించిన మొత్తం 5,25,082
(3) రాష్ట్రప్రభుత్వానికి అందిన మొత్తం 4,29,673

(ఆంధ్రప్రదేశ్ వ్యవసాయశాఖవారి లెక్కలప్రకారం)

కొత్తభూమిని సాగులోకి తీసుకువచ్చుట చాలా ముఖ్యమైన విషయము. ప్రస్తుతము మనరాష్ట్రములో ప్రాజెక్టుల క్రింద భూమి సాగులోకి వచ్చుటకు చాలకాలము పట్టుతూవుంది. మనకు యంత్రములు చాలా తక్కువగా వున్నాయి. విదేశ మారక ద్రవ్యము కొరత వలన కావలసినన్ని యంత్రములను తెచ్చుకోలేకుండా వున్నాము. మనకున్న 118 యంత్రములలో బుల్‌డోజర్లు, ట్రాక్టర్లు 60 మాత్రమే పనిచేస్తున్నాయి. తక్కినవి యంత్రాల విడిభాగాలు కొనుటకుగాను విదేశమారకం లభించనందువల్ల రిపేరీ చేయబడలేదు. పనిచేయటము లేదు. వ్యవసాయాభివృద్ధికిగాను వ్యవసాయ పథకాల క్రింద. జాతీయవిస్తరణ కేంద్రాలక్రింద 7.5 కోట్ల రూపాయలు యీ క్రింది రూపాల్లో అప్పులుగా యిస్తున్నారు.

| వివరాలు | ఒక్కొక్కవ్యక్తికి అప్పు ఇవ్వదగిన మొత్తం |
|---|---|
| 1. విత్తనములకు, ఎరువులకు | రు. 120 |
| 2. రసాయనిక ఎరువులు కొనుటకు | రు. 500 |
| 3. నూతన పరికరములు కొనుటకు | రు. 100 |
| 4. ఆయిల్ ఇంజన్లు, ఎలెక్ట్రిక్ మోటార్లు, పంపు సెట్సు కొనుటకు | రు. 2,500 ఎలెక్ట్రిక్ మోటార్లు<br>రు. 4000 ఆయిల్ ఇంజన్లు |
| 5. ట్రాక్టర్లు కొనుటకు | రు. 16000 |
| 6. ఫిల్టరు పాయింటు బావులు త్రవ్వుటకు | రు. 2500 |
| 7. కొత్తబావులు త్రవ్వుటకు | రు. 2500 |
| 8. పాతబావులు రిపేరు చేయుటకు | రు. 750 |

అప్పులబాధతో గ్రామసీమల్లో పేద, మధ్యతరగతి రైతాంగం ఎంతో బాధపడే విషయము అందరికీ తెలిసినదే.

ప్రభుత్వం యిచ్చే యీ అప్పులు ఏ యే స్కీముక్రింద ఎంతెంత మొత్తం వున్నది చూపాను. ప్రస్తుతం యీ అప్పులు యిచ్చు విధానం

ప్రధానంగా భూమి ఎంత కలిగివున్నాడనే దానిమీద ఆధారపడి వున్నది. అంచేత పెద్ద మొత్తం అప్పులన్నీ భూస్వాములకు ధనిక రైతులకే కాని పేద, మధ్యతరగతి రైతులకు యివ్వడానికి వీలుకాదు. పోతే తక్కిన స్కీములక్రింద కూడ యిచ్చే అప్పులు గ్రామాల్లో ప్రధానంగా పలుకుబడికలిగిన వారికే పోతున్నాయి. ఒక్కరికే రెండు మూడు స్కీములక్రింద కూడా అప్పు లివ్వవచ్చును.

అప్పులక్రిందనున్న మొత్తం 7.5 కోట్లలో ప్రధాన భాగమంతా భూస్వాములు, ధనిక రైతులు, ప్రభుత్వపక్షంలో పలుకుబడిగలవారికే చెందుతున్న సంగతి అందరికీ తెలిసినదే.

అదేవిధంగా ఎరువులు, మంచివిత్తనాల సప్లయికూడా పైవారికే ప్రధానంగా చెందుతున్నాయి. పేద, మధ్యతరగతి రైతాంగానికి ముట్టడంలేదు.

వ్యవసాయశాఖ క్రింద వ్యవసాయము అభివృద్ధికోసము సాగించే పరిశోధన మొదలైనవి మొత్తము రైతాంగానికి అందుబాటులో లేవు. పరిశోధన చేసినంతమేరకైనా ప్రచారముచేసి వాటిని పెద్దఎత్తున ఆచరణలోకి తీసుకురాలేకపోతున్నారు. రెండోవైపున అప్పులు, అడ్వాన్సులు, మంచి విత్తనాలు, ఎరువుల సప్లయి ప్రధానంగా భూస్వాములు, ధనిక రైతాంగము, ప్రభుత్వపక్షంలో పలుకుబడిగల వారికే చెందుతున్నాయి. ఆహార ఉత్పత్తిని పెంచడానికి మూల సమస్యయైన భూసంస్కరణలు అమలు జరగలేదు. ఈ పరిస్థితులలో మన రాష్ట్రములో అధిక ఆహారోత్పత్తి ఏవిధంగా సాగినదో చూద్దాము.

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలములో 16 లక్షల 43 వేల టన్నుల అధిక ఆహార ధాన్యాలను పండించాలని నిర్ణయించబడినది. అంటే 1955–56 లో 55 లక్షల 33 వేల టన్నుల నుండి 1960–61 నాటికి 71 లక్షల 76 వేల టన్నులకు ఉత్పత్తిని పెంచాలని నిర్ణయించ బడినది.

ప్రస్తుతము లభించిన లెక్కల ప్రకారం గత పదిసంపత్సరాలలో ఆహారోత్పత్తి యీ క్రిందివిధంగా నున్నది.

# 1949 - 50 నుండి 1958 - 59 వరకు

## ఆంధ్రప్రదేశ్‌లో ధాన్యం, జొన్నలు, పప్పుల ఉత్పత్తి వివరాలు

| | ధాన్యం ఉత్పత్తి (టన్నులలో) | జొన్నలు, గోధుమ, బార్లీ ఉత్పత్తి (టన్నులలో) | పప్పుల ఉత్పత్తి (టన్నులలో) | పప్పులతోసహా ఆహార ధాన్యాలు (టన్నులలో) |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1949-50 | 20,50,565 | 17,85,821 | 2,86,954 | 41,23,340 |
| 1950-51 | 22,36,477 | 14,65,658 | 2,64,144 | 39,66,279 |
| 1951-52 | 24,17,810 | 14,67,830 | 2,74,190 | 41,59,830 |
| 1952-53 | 22,06,400 | 22,10,940 | 2,51,420 | 46,68,760 |
| 9153-54 | 30,77,250 | 22,75,080 | 2,05,340 | 56,57,670 |
| 1954-55 | 31,07,660 | 22,97,120 | 2,94,090 | 53,98,860 |
| 1955-56 | 30,49,700 | 22,09,700 | 2,73,900 | 55,33,300 |
| 1956-57 | 33,53,140 | 21,73,890 | 2,71,610 | 57,98,640 |
| 1957-58 | 32,92,700 | 23,12,000 | 2,63,200 | 58,67,900 |
| 1958-59 | 36,55,500 | 22,67,800 | 2,74,200 | 61,97,500 |
| 1959-60 | 36,14,200 | 23,55,200 | 2,74,200 | 62,43,600 |

1949-50 నుండి 56-57 వరకు అసలు లెక్కలపై ఆధారపడినవి.

1957-58 మరియు 58-59 ఆఖరి అంచనాపై ఆధారపడినవి.

1959-60 పప్పులు, చిన్న జొన్నలు మినహా మిగతావి ఆఖరి అంచనాపై ఆధారపడినవి.

(అర్థగణాంకశాఖవారి లెక్కలప్రకారం)

దీనినిబట్టి రెండవ ప్రణాళికాకాలములో ఆహారోత్పత్తి ఎంత వరకు సాధింపబడినదో తెలుసుకోవచ్చును.

1955–56 లో 55 లక్షల 33 వేల టన్నుల ఆహారధాన్యాలు ఉత్పత్తి అయ్యాయి. 1959–60 నాటికి అంచనాల ప్రకారము 62 లక్షల 43 వేలు ఉత్పత్తి అయింది. దీనిప్రకారము రెండవ ప్రణాళిక నాలుగు సంవత్సరాలకాలములో అదనంగా ఉత్పత్తిచేసిన మొత్తము 7 లక్షల 10 వేల టన్నులు మాత్రము. అనగా 9 లక్షల 33 వేల టన్నులు యీ ఒక్క సంవత్సరములో అనగా 1960–61లో అధికంగా పండాలి. అంటే ప్రణాళికాకాలము 4 సంవత్సరాలలోనూ అధికోత్పత్తి జరిగినది. రెండవ పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించుకున్న లక్ష్యంలో 43 శాతము మాత్రము. తక్కిన 57 శాతము ఒక్క సంవత్సరములో అధికంగా ఉత్పత్తి చేయాల్సి వున్నది.

గత అనుభవాన్నిబట్టి ఇది అసంభవమైన విషయమని వేరే చెప్పనవసరము లేదు. దీనినిబట్టి రెండవ ప్రణాళికాకాలములో నిర్ణయించుకున్న లక్ష్యాన్ని సాధించలేకపోయారనేది స్పష్టమవుతున్నది.

# 7. పరిశ్రమలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలకు సంబంధించిన లక్ష్యాలలో యీ క్రిందివిధంగా చెప్పారు : "ప్రాతిపదిక, భారీపరిశ్రమల స్థాపనకు ప్రత్యేక ప్రాధాన్యతనిస్తూ సత్వర పారిశ్రామికాభివృద్ధిని సాధించుట."

దీనినిబట్టి దేశములో పారిశ్రామికాభివృద్ధికి యెంత ప్రాముఖ్యత నిచ్చారో అర్థమవుతుంది. కాని ఆంధ్రప్రదేశ్‌లో రెండవ ప్రణాళికాకాలంలో పరిశ్రమల కెంతప్రాధాన్యతనిచ్చారో, ఎంత అభివృద్ధియైనదో, తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము.

పారిశ్రామికంగా యీ రాష్ట్రం అంత అభివృద్ధి చెందకపోయి నప్పటికీ, యిక్కడ వున్నట్టి వ్యవసాయ, అటవీ, ఖనిజసంపదలు, థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పాదనకుగల ఆధారాలు రాష్ట్రం పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధిచెందడానికి ఉజ్వలమైన అవకాశాలను కల్పిస్తున్నవి.

వ్యవసాయ సామగ్రి, ఖనిజములు, అటవీ సంపద, వ్యవసాయోత్పత్తుల విషయంలో ఆంధ్రప్రదేశ్ సమృద్ధివంతమైనది. పొగాకు, చెరకు, వేరుశనగ, ఆముదాలు, ప్రత్తి, జనుము యిక్కడ విశేషంగా పండుతున్నవి.

ఈ రాష్ట్రమునకు అపారమైన ఖనిజసంపదకూడా కలదు. సింగరేణి, కొత్తగూడెం, బెల్లంపల్లి మున్నగుచోట్ల బొగ్గు లభిస్తుంది. గోదావరి లోయప్రాంతంలో బొగ్గు త్రవ్వితీయడానికి అన్వేషణ జరుపబడుతున్నది. కృష్ణా, గోదావరి డెల్టాప్రాంతంలో లిగ్నైట్ కూడా లభించగలదని ఆశింపబడుచున్నది. ఈ డెల్టాలో నూనెకూడా లభించగలదని తెలుస్తున్నది. ఇల్మెనైట్, మోనజైట్, ఇసుక అపారంగావున్నది. నెల్లూరుజిల్లాలో యురేనియం వున్నది. ఆదిలాబాద్, కరీంనగర్, ఖమ్మం, కృష్ణా, కర్నూలు జిల్లాలలో నాసిరకం, నాణ్యపురకం ముడియినుము విశేషంగావున్నది. ఈ ముడియినుము విదేశాలకు, ముఖ్యంగా జపానుదేశానికి ఎగుమతి చేయబడుచున్నది. ఆంధ్రప్రదేశ్ లోని వివిధ ప్రాంతాలలో మాంగనీస్ ఖనిజము కూడా కలదు. ఇది ముఖ్యంగా శ్రీకాకుళం జిల్లాలో విశేషంగా లభిస్తుంది. నెల్లూరు జిల్లాలో మైకాగనులున్నవి. మైకా ముడిరూపంలోనే ఎగుమతి చేయబడుతూంది. అనేక ప్రాంతములలో సున్నపురాయి విశేషంగా లభిస్తుంది. కడపలో ఆస్బెస్టాస్ సమృద్ధిగా లభిస్తుంది. రాయలసీమలో అనేక విధములైన ఖనిజములు లభిస్తాయి. కొద్ది మొత్తములుగా బంగారము, వజ్రాలుకూడా రాయలసీమలో లభించే అవకాశాలున్నవి. సూళ్లూరుపేటవద్ద జిప్సం లభిస్తుంది. ఇక్కడ బ్లాకు గ్లాసులు తయారుచేసే నాణ్యమయిన యిసుకకూడా లభిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో నూటికి 60 వంతుల ప్రాంతము యింత వరకూ భూగర్భ విషయకంగా పరిశోధింపబడలేదు. కాని ప్రతీతినిబట్టి ఆంధ్రప్రదేశ్ యొక్క 1,10,000

చ. మై. ప్రాంతంలో భూగర్భంలో ఏ ఖనిజములు ఎంత మొత్తం లభించగలవో మనం ఒక అంచనా వేసుకోవచ్చును.

ఇప్పటికే ఆంధ్రప్రదేశ్‌లో ఎన్నో అడవులున్నవి. అడవులు పెంపొందించడానికి యింకా అనేక అభివృద్ధి పథకములు అమలు జరుపబడుచున్నవి. ఈ అడవులలోని సంపదను పరిశ్రమలకు వినియోగించడానికి అనేక అవకాశా లున్నవి. కాగితం, అగ్గిపెట్టెలు, ప్లైవుడ్ మొదలగు పరిశ్రమలను ఆంధ్రప్రదేశ్‌లో స్థాపించవచ్చును. (ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సమాచారశాఖచే ప్రచురింపబడిన "ఆంధ్రప్రదేశ్ పరిశ్రమలు" అనే పుస్తకం నుండి)

మన రాష్ట్రంలో పరిశ్రమాభివృద్ధికి అపూర్వావకాశా లున్నవనేది స్పష్టము. కాని నేటి మన పరిశ్రమాభివృద్ధి పరిస్థితి చూద్దాము. ఈ విషయమై అస్సెంబ్లీలో బడ్జెట్ చర్చ సందర్భమున 14—3—60 న గౌరవనీయులైన పెద్దపరిశ్రమల శాఖామంత్రిగారి ఉపన్యాసమును పరిశీలించిన కొంతవరకు బోధపడగలదు.

"మన రాష్ట్రానికి వ్యవసాయసంపద సమృద్ధిగానే వుంది. కాని పారిశ్రామిక సంపదను, అది లభ్యంకాగల అవకాశాలను యింకా అన్వేషించవలసే వుంది. మన రాష్ట్రంలో పారిశ్రామిక యూనిట్లు చాలా స్వల్పం. ఉన్నవాటిలోకూడ సుమారు 80 శాతం బియ్యం, నూనె మిల్లులే. పరిశ్రమలో తలసరి పెట్టుబడి రూ. 10 మాత్రమే! అదే బొంబాయిలో రూ. 46 లు. పశ్చిమ బెంగాలులో రూ. 65 లు. అఖిలభారత స్థాయిలో చూస్తే పరిశ్రమలమూలంగా తలసరి ఆదాయం రూ. 20 లు ఉంటుంది. కాని మన రాష్ట్రంలో రూ. 8 లు మాత్రమే. ఫ్యాక్టరీ పరిశ్రమల మూలంగా లభించే ఆదాయం రాష్ట్రాదాయంలో 3 శాతం మాత్రమే. దేశంలోని అనేక యితర రాష్ట్రాలతో పోల్చి చూస్తే మన రాష్ట్రంలో పనిచేస్తున్న పెద్దతరహా, మధ్యతరహా పారిశ్రామిక యూనిట్లసంఖ్య చాలా తక్కువ. ఇంతేకాదు. కొత్త యూనిట్లను స్థాపించడంలో కూడా మన రాష్ట్ర గమనం చాలా మందకొడిగా వుంది. మనం పారిశ్రామికరంగాన్ని విస్తరించడానికి కృతనిశ్చయులమై ప్రయత్నిస్తేనేతప్ప, వ్యవసాయోత్పత్తిలో ఎంత

ముందంజవేసినా మన ఆర్థికాభివృద్ధికి అంతరాయం తప్పదు. కాగా ప్రభుత్వలక్ష్యాలలో ప్రధానమైంది ఒక టేమంటె పరిశ్రమలను ప్రోత్సహించి పెంపొందించటం. నా వుద్దేశం కేవలం పెద్ద తరహా, మధ్య తరహా పరిశ్రమలేకాదు ; చిన్నతరహా, కుటీర, గ్రామపరిశ్రమలుకూడా. ఈ చివరివర్గపు పరిశ్రమలో ఉద్యోగావకాశాలు చాలా వుంటాయి. మొదటివర్గపు పరిశ్రమలు మన పారిశ్రామిక, ఆర్థిక అభివృద్ధికి ప్రాతిపదికవంటివి. పెద్ద తరహా, మధ్యతరహా పారిశ్రామిక యూనిట్లను స్థాపిస్తే వాటికి అనుబంధంగాఉండే చిన్నతరహా యూనిట్లు అనేకం నెలకొనడానికి అవకాశంవుంటుందన్న విషయంకూడా యీసందర్భంలో గమనార్హం. కాగా పెద్దతరహా యూనిట్లను నెలకొల్పడంవల్ల ఉద్యోగావకాశాలు నేరుగానేకాక పర్యవసానరూపంలోకూడా పెరుగుతాయి.

౩. పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలో చక్కెర, సిమెంటు పరిశ్రమలు యీ రాష్ట్రంలో బాగానే అభివృద్ధి చెందాయి. ఆ తరువాత బహుశా బట్టల మిల్లుల పరిశ్రమ వస్తుంది. ఈ మూడు పరిశ్రమలలో జరిగిన అభివృద్ధియైనా మన సాధనసంపత్తికి అనుగుణంగా లేదు, అంటే ఇంకా ఎంతో విస్తృతికి అవకాశం ఉందన్నమాట. అంతేగాక మన బహువిధ ఖనిజ సంపత్తిని ఉపయోగించుకుంటూ రసాయనిక పరిశ్రమలను, లోహపరిశ్రమలను, ఇంజనీరింగు పరిశ్రమలను నెలకొల్పుటకూడా అవసరం. ఇవేకాక, మన వ్యవసాయపు ముడి పదార్థాలతో పరిశ్రమలు స్థాపించవచ్చును. ఇందులో తయారయ్యే వస్తువులు వ్యవసాయ రంగానికి ఉపకరిస్తాయి. ఈలాటి పరిశ్రమలు మన రాష్ట్రంలో స్థాపించడానికి అనువుగా ఉన్నాయి.

4. రెండవ ప్రణాళికాకాలంలో మనం సాధించిన పారిశ్రామిక విస్తృతి నిరాశాజనకంగా ఉంది. కొన్ని పంచదార ఫ్యాక్టరీలు, కొన్ని సిమెంటు ఫ్యాక్టరీలు నెలకొన్నాయి. ఏ. సి. యస్. ఆర్., కండక్టర్లు, పవర్ ఆల్కహాలు, సల్ఫ్యూరిక్ యాసిడ్, సూపర్‌ఫాస్ఫేటు తయారు చేసే మరికొన్ని యూనిట్లు కొద్దిగా స్థాపింపబడుచున్నవి. ఫెర్రో మాంగనీసు తయారుచేసే పెద్దతరహా ప్లాంటుకూడా ఉత్పత్తి ప్రారంభిం

చింది. ఇదంతా నిజమే అయితే, ఇది జరిగిందంతా ప్రయివేటు రంగంలో. రాష్ట్రరంగంలో ఆంధ్ర పేపరుమిల్లు ఉత్పాదకశక్తిని పెంచాలనుకొన్నా, మన ప్రజాళికలకు అడుగడుగునా విదేశమారక ద్రవ్యము లభించక ఎప్పటికప్పుడు కాలవిలంబం జరుగుతూవచ్చింది. అయినా ఒక విషయం చెప్పగలుగుతున్నందుకు నాకు సంతృప్తిగా ఉంది. అదేమంటే, చిట్టచివరకు మనం యీ యిబ్బందుల్ని అధిగమించాము. ఇప్పటినుంచి 18 నెలలలోపల యీ మిల్లు ఉత్పాదకశక్తి రోజుకు 50 టన్నుల కాగితం ఉత్పత్తి అయ్యేంతవరకు పెరుగగలదని నేను ఆశిస్తున్నాను. గూడూరులోని ప్రభుత్వ సిరామిక్ పరిశ్రమ ఉత్పాదకశక్తిలోకూడా కొంత వృద్ధిని సాధించాం.

మంత్రిగారి ఉపన్యాసమునుబట్టి మన రాష్ట్రములోనున్న పరిశ్రమల దుస్థితి సవివరంగా తెలుస్తుంది. ఒకవైపు రాష్ట్రములో పరిశ్రమాభివృద్ధికివున్న అపూర్వ అవకాశాలు, రెండోవైపు 'నానాటికీ తీసికట్టు నాగంభొట్లు' అన్న పరిస్థితిలోనున్న మన పరిశ్రమాభివృద్ధి గమనించినప్పుడు ప్రతి ఆంధ్రుడు విచారించక మానడు!

## ఆంధ్రప్రదేశ్‌లో నెలసరి సగటు పారిశ్రామికోత్పత్తి

| సంవత్సరం | నెలసరి సగటు | జౌళిపరిశ్రమ నూలు 1,000 పౌనులు | జౌళిపరిశ్రమ బట్ట 1,000 గజాలు | కాగితం టన్నులు | చక్కెర టన్నులు | సిమెంటు టన్నులు |
|---|---|---|---|---|---|---|
| 1952 | నెలసరి సగటు | 1539 | 3191 | 608 | 3544 | 17411 |
| 1954 | ,, | 1744 | 3167 | 1182 | 3846 | 16598 |
| 1955 | ,, | 1937 | 3529 | 1254 | 3717 | 16992 |
| 1956 | ,, | 1947 | 3562 | 1404 | 4511 | 18456 |
| 1957 | ,, | 2053 | 3396 | 1723 | 4534 | 21853 |
| 1958 | ,, | 2161 | 2840 | 1716 | 4902 | 31437 |
| 1959 | ,, | 2397 | 2612 | 1850 | 5134 | 45999 |

| సంవత్సరం | నెలసరి సగటు | రసాయనికములు | | | పంచదార టన్నులు | జనపనార టన్నులు | బొగ్గు టన్నులు |
|---|---|---|---|---|---|---|---|
| | | బొమికల పొడి టన్నులు | సూపర్ ఫాస్ఫేట్ టన్నులు | ఎరువులమిక్చర్ టన్నులు | | | |
| 1952 | .. | 112 | 357 | 1552 | 5574 | 2107 | 110914 |
| 1954 | ,, | 123 | 335 | 2398 | 6376 | 2167 | 126185 |
| 1955 | .. | 103 | 213 | 697 | 9350 | 2200 | 133044 |
| 1956 | ,, | 97 | 350 | 318 | 11429 | 2463 | 145493 |
| 1957 | ,, | 167 | 144 | 236 | 12038 | 2465 | 159808 |
| 1958 | ,, | ... | 72 | 63 | 31437 | 2752 | 176380 |
| 1959 | ,, | 274 | ... | ... | 29889 | 2577 | 111037 |

(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారిచే ప్రకటింపబడే స్టాటిస్టికల్ బులెటిన్ నుండి)

## 1953 నుండి '58 వరకు ఖనిజ ఉత్పత్తి

| సంవత్సరం | ఆస్బెస్టాస్ (టన్నులు) | బారైట్స్ (టన్నులు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1953 | 247 | 3,264 |
| 1954 | 111 | 7,051 |
| 1955 | 321 | 4,341 |
| 1956 | 413 | 5,444 |
| 1957 | 214 | 2,736 |
| 1958 | 369 | 24,610 |

| సంవత్సరం | | గ్రాఫైట్ (టన్నులు) | క్యనైట్ (టన్నులు) | మాంగనీస్ (టన్నులు) | మైకా (టన్నులు) |
|---|---|---|---|---|---|
| | 4 | 5 | 6 | 7 | 8 |
| 1953 | — | 19 | — | 198727 | 2499 |
| 1954 | 262 | 69 | 23 | 79853 | 2564 |
| 1955 | 5 | 120 | — | 105697 | 4150 |
| 1956 | 325 | 72 | 684 | 328465 | 3614 |
| 1957 | — | 89 | 152 | 157595 | 5023 |
| 1958 | — | 261 | 490 | 14298 | 48051 |

| సంవత్సరం | సున్నపురాయి (టన్నులు) | సున్నపురాయి బ్లాక్స్ (టన్నులు) | పలకరాయి (టన్నులు) | క్వారీ (టన్నులు) |
|---|---|---|---|---|
| | 9 | 10 | 11 | 12 |
| 1953 | 353500 | 850 | ... | 2834 |
| 1954 | 577064 | 1396 | 816 | 3666 |
| 1955 | 244056 | ... | 1795 | 2858 |
| 1956 | 318724 | ... | ... | 4337 |
| 1957 | 448801 | ... | ... | 8950 |
| 1958 | 734718 | ... | ... | 4245 |

| సంవత్సరం | కట్టడం రాయి | పలక రాయి | ఇనుము | ముడి బంగారం |
|---|---|---|---|---|
| | 13 | 14 | 15 | 16 |
| 1953 | 27,967 | 482 | 1,53,674 | ... |
| 1954 | 8,326 | ... | 4,52,462 | ... |
| 1955 | 21,908 | ... | 6,62,696 | ... |
| 1956 | 32,064 | ... | 8,18,344 | 36,766 |
| 1957 | 27,579 | ... | 4,64,295 | ... |
| 1958 | 52,410 | ... | 2,80,041 | ... |

(ఆంధ్రప్రదేశ్ గనులు, ఖనిజాలు డైరెక్టరునుండి సేకరించబడినవి.)

పై పట్టికలను చూచిన మన రాష్ట్రములో వివిధ పరిశ్రమల్లోను గనుల్లోను ఉత్పత్తి వివరాలు లభించినంతవరకు యివ్వబడ్డాయి. వాటినిబట్టి మన రాష్ట్రములో ఉత్పత్తి చాలా తక్కువగా ఉన్న దనేది స్పష్టము. అంతెగాక రెండవ ప్రణాళికాకాలములో అభివృద్ధి కూడా చాలా తక్కువగా నున్నది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలములో కేంద్రము మరియు రాష్ట్ర ప్రభుత్వాలు కలసి మొత్తము 'పరిశ్రమల గనుల' పద్దుక్రింద ఖర్చు చేయవలసిన మొత్తము రు. 890 కోట్లు.

మన రాష్ట్రములో అటు కేంద్రప్రభుత్వము, ఇటు రాష్ట్ర ప్రభుత్వము కలసి ఖర్చుచేయ తలపెట్టిన మొత్తము రు. 21 కోట్లు మాత్రమే. అంటే మొత్తము మన రాష్ట్రములో ఖర్చు చేయునది భారతదేశ మొత్తములో 2.2 శాతము మాత్రమే.

కేంద్రము వాటాగా మన రాష్ట్రములో ఖర్చు చేయటానికి కేటాయించినది బహు తక్కువ. ఇంతవరకు మన రాష్ట్రములోనున్న పరిశ్రమలలో రు. 20 కోట్లు ఖర్చుపెట్టాలని నిర్ణయించబడినది.

ఈ క్రింది వివరాలు యివ్వబడ్డాయి.

| | |
|---|---|
| 1. సింగరేణి బొగ్గుగనుల విస్తరణ | రు. 9 కోట్లు |
| 2. ప్రాగా(టూల్స్)పనిముట్లు కార్పొరేషన్ నికి మొత్తం | 0.75 ,, |
| 3. సహకార చక్కెర మిల్లుకు | 0.20 ,, |
| 4. సహకార నూలు మిల్లుకు | 0.20 ,, |
| 5. చర్మకార పరిశ్రమ | 0.10 ,, |
| మొత్తం— | 10.25 ,, |

| నౌకా నిర్మాణ పరిశ్రమ | రూ. కోట్లు |
|---|---|
| 1. తొలి ప్రణాళికలో మిగిలిన ఖర్చు | 0.55 ,, |
| 2. 1956–57 లో సింధియాకు చెల్లించవలసిన ఆఖరి వాయిదా — — | 0.338 ,, |
| 3. నౌకా నిర్మాణకేంద్రంలో నిర్మించబడిన నౌకల నిర్మాణపు సబ్సిడీ— — — | 5.00 ,, |
| 4. 8 మొదలు 12 నౌకల నిర్మాణాని కనువుగా నౌకానిర్మాణ కేంద్రాన్ని విస్తృతపరచడం — | 1.00 ,, |
| 5. డ్రైడాక్ నిర్మాణం | 2.14 ,, |
| మొత్తం— | 9.028 ,, |

(వివరాలు రెండవ ప్రణాళికనుండి)

మొత్తం రు. 19.278 కోట్లు కేటాయించబడినది. కాని రెండవ ప్రణాళిక ప్రారంభమై 4 సంవత్సరములైనా యింతవరకు ఖర్చుచేసినది చాలా స్వల్పము.

ఇక రాష్ట్ర ప్రభుత్వము రెండవ ప్రణాళిక కాలములో పెద్ద పరిశ్రమలక్రింద ఖర్చు చేయదలచినది మొదట 2 కోట్ల 74 లక్షలు. తర్వాత యీ మొత్తాన్ని 2 కోట్ల 22 లక్షలకు తగ్గించారు. ఈ తక్కువ మొత్తముకూడా యింతవరకు సక్రమంగా ఖర్చు చేయ బడలేదు. ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో ఖర్చుచేయ

ఇక రాష్ట్ర ప్రభుత్వం రెండవ ప్రణాళికాకాలంలో పెద్ద పరిశ్రమలు మరియు చిన్న పరిశ్రమలు, గ్రామీణ పరిశ్రమలక్రింద కేటాయించిన మొత్తమూ, దానిని ఖర్చుచేసిన విధమూ పరిశీలిద్దాం :

| వివరం | రెండవ ప్రణాళికలో మొత్తం కేటాయింపు | క్రింది సంవత్సరాలలో అయిన ఖర్చు 1956–57 ఖర్చు | 1957–58 ఖర్చు | 1958–59 ఖర్చు | 1959–60 సవరించిన అంచనా | 1960–61 కేటాయింపు |
|---|---|---|---|---|---|---|
| **I. పెద్ద పరిశ్రమలు :** | | | | | | |
| 1. రాజమండ్రి ఆంధ్ర పేపరుమిల్లువిస్తరణ | 126.62 | .. | .. | 2.40 | 54.23 | 70.00 |
| 2. ప్రభుత్వపింగాణిమిల్లు(గూడూరు)విస్తరణ | 12.67 | 2.57 | 1.81 | 2.79 | 5.50 | ... |
| 3. తిరుపతిలో వెంకటేశ్వర పేపరు మిల్లు, స్ట్రాబోర్డు మిల్లు స్థాపన | 1.51 | ... | 0.01 | 1.23 | 0.27 | ... |
| 4. సహకార పంచదార మిల్లులు | 81.19 | 0.22 | 24.23 | 24.06 | 32.34 | 0.34 |
| | 222.00 | 2.79 | 26.05 | 30.48 | 92.34 | 70.34 |
| **II. చిన్న మరియు గ్రామీణ పరిశ్రమలు :** | | | | | | |
| ఆంధ్ర ప్రాంతంలో | 154.61 | 6.42 | 18.69 | 35.30 | 44.54 | 49.66 |
| తెలంగాణా ప్రాంతంలో | 111.84 | 8.29 | 11.25 | 31.70 | 30.26 | 30.34 |
| | 266.45 | 14.71 | 29.94 | 67.00 | 74.80 | 80.00 |

(1960–61 రెండవ ప్రణాళిక రివ్యూ నుండి)

బడిన మొత్తము రు. 59.32 లక్షలు. అంటే మొత్తం కేటాయింపులో 26.7% మాత్రము ఖర్చు చేయబడినది. నాల్గవ సంవత్సరము 92.34 లక్షలు ఖర్చు చేయాలనుకున్నారు. 1959–60 లో 70.34 లక్షలు ఖర్చు చేయాలని ఆశిస్తున్నారు. ఎంతవరకు ఖర్చు చేయగలరో చూడాల్సి వున్నది. రాజమండ్రి పేపరుమిల్లు అభివృద్ధి యింతవరకు విదేశ మారకము లభించక ఆగిపోయినది. మనకు కేటాయించిన ఆ కొద్ది మొత్తానికి కావలసిన విదేశ మారకము లభించక పోవటం చిత్రంగానే వుంటుంది. కాని అదీ పరిస్థితి! ప్రస్తుతము విదేశ మారకము లభించినదని, పని పూర్తయితే 18 నెలలలో దీని ఉత్పత్తి శక్తి పెరుగుతుందని, గూడూరులో పింగాణి పరిశ్రమ ఉత్పత్తిలో గూడా కొంత అభివృద్ధి సాధించామని మంత్రిగారు చెప్తున్నారు.

ఇది ఇలాఉండగా రాష్ట్రములో బాగా లాభాలు వస్తుందనుకున్న 'అల్విన్ మెటల్‌వర్క్సు' ఫ్యాక్టరీని బిర్లాకు ప్రభుత్వ షేర్లు తక్కువ ధరకు అమ్మారు.

దీనిపై అంచనాల కమిటీ ఆవిధంగా అమ్మటాన్ని తీవ్రంగా విమరిస్తూ దానిని మరల ప్రభుత్వము కొనాలని సలహా యిచ్చినది.

రాష్ట్రములో పరిశ్రమలవృద్ధికి కేంద్రప్రభుత్వము ఏమాత్రము తోడ్పడక పోవటాన్ని గౌ. పరిశ్రమల శాఖామంత్రి తీవ్రంగా విమర్శించారు. రాష్ట్ర అసెంబ్లీలో పరిశ్రమలపై ప్రభుత్వ, ప్రతిపక్షాలు ఏకగ్రీవంగా తీర్మానాన్ని ఆమోదించారు. తర్వాత పరిశ్రమల మంత్రి ఢిల్లీకి వెళ్ళి మన కోర్కెలను నివేదించారు. కాని కేంద్రమంత్రి మన రాష్ట్రములో ఏయే పరిశ్రమలను స్థాపించాలి, వాటికి కావలసిన వివరమైన ప్లాను లున్నాయా ఏవిధంగా పనిచేస్తాయి – మొదలైన ప్రశ్నలువేసి సమాధానాలు కావాలన్నారు. అసలు కేంద్రము మన రాష్ట్ర పరిశ్రమలఅభివృద్ధి విషయములో పూర్తిగా నిర్లక్ష్యము చూపుతోంది. దీనికితోడు మన ప్రభుత్వము ఇందుకు సంబంధించిన సమగ్రమైన సమాచారాన్ని తయారుచేసి తగు చొరవను చూపలేక పోతోంది.

రాష్ట్ర పరిశ్రమలఅభివృద్ధికి కావలసిన సమాచారము ప్లానులు లేవు. అందుకనే పరిశ్రమల శాఖామాత్యులు రాష్ట్రములోనున్న పరిశ్రమలను గురించి పూర్తి వివరాలు సేకరించి సమగ్రమైన పరిశ్రమల ప్లాను తయారుచేస్తా మంటున్నారు. ఇప్పటికైనా చేస్తారని ఆశిద్దాము.

రెండవ ప్రణాళికాసమయములలో పరిశ్రమలను పెద్దయెత్తున అభివృద్ధి చేయాలని చెప్పారు. కాని మన రాష్ట్రములో పరిశ్రమలఅభివృద్ధి ఏమీ ముందుకు పోలేదు.

## సాంఘిక సంక్షేమము

ద్వితీయ ప్రణాళికాకాలంలో విద్య, వైద్యము, ప్రజారోగ్యము, గృహనిర్మాణము, కార్మికసంక్షేమము, వెనుకబడినజాతులు, గిరిజనులు, హరిజనులు, మహిళా సంక్షేమ కార్యక్రమా లన్నిటికి కలిపి అయిదు సంవత్సరాల కాలములో ప్రణాళికక్రింద రు. 34½ కోట్లు ఖర్చు చేయాలని తలపెట్టబడినది. ఇందులో చాలావరకు ఖర్చుపెట్టబడినది. కాని రాష్ట్రములో మనకున్న అవసరాలదృష్ట్యా యిది తక్కువ మొత్తమని వేరే చెప్ప నక్కరలేదు. (స్థలా భావముచే వివరాలలోకి వెళ్ళుటము లేదు.)

# 8. ఉద్యోగావకాశాలు

ద్వితీయ ప్రణాళిక కార్యక్రమములు రూపొందించుటలో ఒక ప్రధాన అంశము ప్రస్తుతమున్న నిరుద్యోగపరిస్థితి యింకా దిగజారకుండా నిరోధించుట, ఉద్యోగావకాశములను విస్తృత మొనర్చుట.

ఈ క్రింది నిరుద్యోగులను దృష్టిలో వుంచుకుని ఉద్యోగావకాశములను కల్పించటయే మన విధానము. మొదటివారు ప్రస్తుతమున్న నిరుద్యోగులు; రెండవవారు దేశజనాభా పెరుగుదల ఫలితముగా ప్రతీ

ఏటా కార్మికబలమునందు చేరువారు; మూడవవారు కొన్ని ప్రాజెక్టులు పూర్తయినందున పనిలేనందువలన నిరుద్యోగులయినవారు; నాలుగవ వారువ్యవసాయము తత్సంబంధమైనపనులందు నియమితులయినప్పటికీ పూర్తిగా పనిపాటలు లేనివారు. ఎలాగయితేనేమి దేశం మొత్తము మీద నిరుద్యోగాన్ని తొలగించాలంటే ద్వితీయ ప్రణాళికా కాలంలో 1 కోటీ 53 లక్షల ఉద్యోగావకాశాలను కల్పించాలని అంచనా వేయ బడింది.

మనరాష్ట్రంలో నిరుద్యోగసమస్యను పరిష్కరించాలన్న సుమారు 13 లక్షల 50 వేల ఉద్యోగావకాశాలను కల్పించాలి. సరైన సమా చారం వేరేలేనందున మన జనాభా మొత్తం దేశ జనాభాలో 8.8% ప్రకారము యీ అంచనా వేయబడినది.

మన రాష్ట్రంలోని వివిధ అభివృద్ధి కార్యక్రమముల క్రింద, పరి పాలనలోను నిపుణులూ, సాధారణ పనివారూ మొత్తం అన్నివిధాలా 5 మొదలు 6 లక్షల వరకూ ఉద్యోగావకాశాలను సాధారణంగా కల్పించటానికి అవకాశా లున్నాయి.

(ఆంధ్రప్రదేశ్ ద్వితీయ ప్రణాళిక 5వ అధ్యాయం నుండి)

దీనినిబట్టి మనకు ఒక విషయము స్పష్టమవుతుంది. ప్రణాళికా సంఘము అంచనానుబట్టి మొత్తము మన రాష్ట్రములో సుమారు 13 లక్షల 50 వేల మంది నిరుద్యోగులుంటే, కేవలము అయిదారు లక్షలవరకు మాత్రమే ఉద్యోగవసతులు కల్పించగలమని అంచనా వేశారు. అంటే మొత్తము నిరుద్యోగులలో సుమారు 45% మందికి మాత్రము ఉద్యోగావకాశాలు కల్పించగలమని అంచనా వేయబడింది. తక్కినవారి సంగతేమయేట్టు? వీరి విషయములో ప్రణాళిక మార్గము చూపలేక పోయినది. యింతవరకూ రెండు ప్రణాళికలు అమలు జరిగిననూ అభాగ్యులయిన యీ నిరుద్యోగుల సంగతింతేనా? ప్రాథ మికంగా ప్రణాళికలో ఆర్థిక వనరులను సేకరించే విధానములను, ప్రధానమయిన భూసంస్కరణల విషయములో అవలంబించిన పద్ధ తులూ మొదలయిన వాటివలన యింతకంటే అవకాశాలను చూప లేదనుట స్పష్టము.

ఇక అంచనా వేసినంతవరకయినా ఎంతవరకు జయప్రద మయి నదో చూద్దాము.

ఎంప్లాయిమెంటు ఎక్ఛేంజీలలో ప్రతి సంవత్సరము రిజిష్టరు కాబడినవారు, వారిలో ఎంతమందికి ఉద్యోగాలు లభించినది క్రింది పట్టికలో యివ్వబడినది.

## ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలలో రిజిష్టరు కాబడినవారు, ఉద్యోగాలు పొందినవారు

| సంవత్సరం | రిజిస్ట్రేషన్ చేయించుకున్న వారిసంఖ్య | కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ప్రైవేట్ పరిశ్రమలలోను-ఉద్యోగాలు యివ్వబడినవారి సంఖ్య | మిగిలినవారు |
|---|---|---|---|
| 1953 | 1,08,456 | 14,412 | 94,044 |
| 1954 | 1,06,692 | 13,332 | 93,360 |
| 1955 | 1,29,744 | 15,344 | 1,14,400 |
| 1956 | 1,30,224 | 16,296 | 1,13,928 |
| 1957 | 1,01,700 | 9,900 | 91,800 |
| 1958 | 1,40,124 | 14,484 | 1,25,640 |
| 1959 | 1,71,865 | 18,956 | 1,52,909 |
| 1960మార్చివరకు | 33,861 | 4,468 | 29,393 |
| 19-3మొదలు60 మొత్తము | 9,22,666 | 1,07,192 | 8,15,474 |
| రెండవప్రణాళికా కాలములో— | | | |
| 1956మొదలు 60 వరకు మొత్తము | 5,77,774 | 64,104 | 5,13,670 |

(అర్థ, గణాంకశాఖ బులిటెన్సునుంచి తీసుకోబడినవి)

మొత్తము 1953 సం. నుండి 1960 మార్చివరకు 9,22,666 మంది ఉద్యోగాలకు రిజిస్ట్రేషన్ చేయించుకుంటే, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలు మరియు ప్రైవేటు కంపెనీలలోను మొత్తము 1,07,192 మందికి ఉద్యోగాలు లభించాయి. అంటే మొత్తము ఉద్యోగాలు కావాలని ముందుగానే రిజిష్టరు చేయించుకున్నవారిలో 11.5% మందికి మాత్రము ఉద్యోగాలు లభించాయి. రెండవ ప్రణాళికా కాలములో అంటే 1956 సంవత్సరంనుండి 1960 మార్చి వరకు మొత్తము రిజిష్టర్ చేయించుకున్నవారి సంఖ్య 5,77,774 కాగా ఉద్యోగాలు లభించినవారు 64,104 మంది మాత్రము. అంటే మొత్తం రిజిష్టర్ చేయించుకున్నవారిలో 11.09 లేదా 11.1% అంటే నూటికి 11.1 మందికి మాత్రమే ఉద్యోగాలు లభించాయి.

అయితే నిరుద్యోగులంతా ఎంప్లాయిమెంటు ఎక్ఛేంజీలో రిజిష్టరు చేయించుకోవటములేదనేది స్పష్టమే. అదేవిధంగా రిజిష్టర్ చేయించుకొనికూడా వేరువిధంగా ఉద్యోగాలు సంపాదించుకునేవారున్నారు. దీనినిబట్టి మొత్తము రాష్ట్రములో నిరుద్యోగ పరిస్థితిని అంచనావేయుట కష్టసాధ్యము. కాని రాష్ట్రములో నిరుద్యోగపరిస్థితి, ఉద్యోగ వసతులు కల్పించుతున్న ధోరణిని మనము స్పష్టంగా అర్థము చేసుకోగలము.

ఇంతకుముందే తెల్పినట్లు రెండవ ప్రణాళికాకాలములో మొత్తము నిరుద్యోగులలో నూటికి 45 మందికైనా (45%) ఉద్యోగాలు చూపించాలని అంచనా వేశారు. ఎంప్లాయిమెంటు ఎక్ఛేంజీ లెక్కల ప్రకారము 1953 నుండి 1960 మార్చివరకు రిజిష్టరు చేసుకున్నవారిలో 11.5% మందికి మరియు రెండవ ప్రణాళికా కాలములో 11.1% మందికి మాత్రము ఉద్యోగాలు లభించాయి. దీనినిబట్టి అంచనా వేసినంతవరకుకూడా జయప్రదముగాలేదనేది స్పష్టమవుతుంది.

రాష్ట్రములోనున్న మొత్తము ఫ్యాక్టరీలు, వాటిలో పనిచేయు కార్మికులు, షాపులలో పనిచేయువారు, వివిధ పరిశ్రమలలో పనిచేయు

వారి సంఖ్యనుకూడా లభించినంతవరకు దిగువపట్టికలలో ఇస్తున్నాను. ఈ అంకెలుకూడా మొత్తము పరిస్థితిని తెలియజేయజాలవు. కాని పరిస్థితియొక్క ధోరణి అర్థము చేసుకొనుటకు తప్పకుండా తోడ్పడగలవు.

| పరిశ్రమ పేరు | పనిచేయువారి సగటు సంఖ్య | | | |
|---|---|---|---|---|
| | 1954 | 1955 | 1956 | 1957 |
| పంచదార | 7,502 | 6,903 | 8,434 | 9,274 |
| జౌళి పరిశ్రమ | 10,124 | 9,757 | 10,410 | 11,195 |
| జనపనార | 2,432 | 6,432 | 6,358 | 7,255 |
| ధాన్యం మిల్లులు | ... | ... | 14,584 | 17,675 |
| పింగాణి పరిశ్రమ | 163 | 215 | 244 | 338 |
| వనస్పతి | .... | ... | 8,318 | 10,369 |
| రసాయనిక పరిశ్రమ | 890 | 390 | 947 | 1,087 |
| జనరల్ ఇంజనీరింగ్ | ... | ... | 6,126 | 6,108 |

(ఆంధ్ర ప్రదేశ్ పరిశ్రమల సెన్సెను 1956–57 నుండి)

## మొత్తము ఫ్యాక్టరీలు, వాటిలో పనిచేయు కార్మికుల సంఖ్య

| | 1956 | 1957 | 1958 |
|---|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్‌లోని మొత్తం ఫ్యాక్టరీల సంఖ్య | 3,955 | 4,185 | 5,374 |
| 2. ఈ ఫ్యాక్టరీలల్లో మొత్తం పనిచేయువారి సంఖ్య | 1,65,312 | 1,67,150 | 1,81,023 |

ఆంధ్రప్రదేశ్‌లో ఫ్యాక్టరీల రిజిస్ట్రేషన్ ప్రకారము పై లెక్కలు తయారైనవి. కాని సాధారణంగా షుమారు 10% ఫ్యాక్టరీలు రిజిష్టరు కావు. మొత్తము కార్మికుల సంఖ్య తెల్పవలయు నన్నపుడు పై మొత్తములకు 10% కలుపవలసి యున్నది. ఆ విధంగా లెక్క గట్టినప్పుడు 1956 సం.లో 1,81,843 మంది, 1957 లో 1,83,865 మంది, 1958 లో 1,99,125 మంది కార్మికులు సగటున పనిచేశారని చెప్పవచ్చును. అంటే 1956 కంటే 1958 లో 17,282 మంది కార్మికులు అదనంగా పనిచేస్తున్నారు.

## షాపులలో పనిచేయువారి సంఖ్య

| సంవత్సరం | పనిచేయువారి సంఖ్య |
|---|---|
| 1957 | 74,384 |
| 1958 | 83,655 |
| 1959 | 89,142 |

(లేబరు డిపార్టుమెంటునుంచి సేకరించబడినవి)

పైపట్టికలోనున్న వివరాలనుబట్టి చూచిననూ అనుకున్నంత ఎరకైనా పూర్తిగా ఉద్యోగావకాశాలను కల్పించలేకపోయారు. పోతే ముఖ్యంగా గ్రామసీమలలో నిరుద్యోగుల పరిస్థితి ఏ విధంగా నున్నదీ, ఎంతవరకు పరిష్కరించుటకు ప్రయత్నించినదీ, సఫలత చెందినదీ ఆలోచిద్దాం. కొంతవరకు వీరి నిరుద్యోగపరిస్థితిని అంచనా వేసి చూడవలసియున్నది కూడా.

1951 జనాభా లెక్కప్రకారము కేవలము వ్యవసాయము మీాద ఆధారపడినవారు సెంటుకూడా భూమిలేకుండా వ్యవసాయ కార్మికులుగా జీవించేవారు (Cultivating labourers) 57,55,285 మంది వున్నారు. వీరిలో కొద్దిగా భూమి వున్నవారుకాని, లేదా

కౌలుదారులుగాని, యితర చేతివృత్తులవారు గాని కలుపలేదు. ప్రత్యేకంగా చూపించబడినారు.

1951 జనాభా లెక్కలప్రకారము (i) స్వంతంగా తమ ఆదాయముపై జీవించేవారు కనీసము తాము జీవించటానికి సరిపడా సంపాదించేవారు (Self-upporting Persons), (ii) కొంతవరకు సంపాదిస్తూ ఇతరులమీద ఆధారపడేవారు (తమ కుటుంబాలలో పనిచేసేవారికి సహాయపడువారు, మరియు తాము సంపాదించేది తాము జీవించటానికి చాలనివారు (Earning Dependents) కలసి మొత్తము జనాభాలో 34.82% ఉన్నారు (అర్థగణాంక శాఖవారి లెక్కలనుండి). దీని ప్రకారము వ్యవసాయ కార్మికులలో, పూర్తిగా గాని, కొంతవరకుగాని పనివున్నవారు 20,03,891 మంది మాత్రమున్నారు. కాని మొత్తం వ్యవసాయ కార్మికులలో పనిచేయగలిగినవారు 34,53,000 మంది ఉంటారని అంచనా వేయవచ్చును. జనాభా లెక్కల ప్రకారము వివిధ వయస్సులు కలిగినవారు మొత్తం జనాభాలో ఏ శాతంలో వుంటారో ఈ క్రిందివిధంగా యివ్వబడినది.

| వయస్సు (సంవత్సరముల మధ్య) | మొత్తం జనాభాలో శాతం |
|---|---|
| 1. 0 | 2.7 |
| 2. 1 మొదలు 4 వరకు | 9.5 |
| 3. 5 ,, 14 ,, | 24.6 |
| 4. 15 ,, 24 ,, | 17.3 |
| 5. 25 ,, 34 ,, | 15.6 |
| 6. 35 ,, 44 ,, | 12.3 |
| 7. 45 ,, 54 ,, | 9.2 |
| 8. 55 ,, 64 ,, | 5.5 |
| 9. 65 ,, 74 ,, | 2.3 |
| 10. 75 అంతకుపైన | 1.0 |
| (1951 జనాభా లెక్కల ప్రకారం) | 100.0 |

దీనినిబట్టి 14 సంవత్సరముల వయస్సు వచ్చేవరకు పనిచేయరని భావించిన మొత్తము జనాభాలో వీరి శాతము 36.8 మరియు 55 సంవత్సరముల పైబడినవారు పనిచేయరని భావించిన మొత్తము జనాభాలో వీరి శాతము 8.8, కాని 14 సంవత్సరముల వయస్సు క్రిందివారు 55 సంవత్సరములవయస్సుకు పైబడినవారి శాతము మొత్తము జనాభాలో 45.61, కాని వ్యవసాయ కార్మికులలో సాధారణంగా 10–12 సంవత్సరములనుంచే ఏదో ఒకపనిలోకి వెళ్తారు. అదేవిధంగా 55 సంవత్సరముల పైబడినవారు చాలామంది పనికి వెళ్తారు. దీనిని దృష్టిలో ఉంచుకొని చూచిన ఏ పరిస్థితులలోనూ పనిచేయకుండా వుండేవారు 40 శాతమునకు మించివుండరు. కానీ పని చేయగలిగిన వారు 60 శాతము ఉంటారు. మొత్తము వ్యవసాయ కార్మికులు 57,55,285 మందిలో పని చేయగలవారు 60% ప్రకారము 34,53,000 మంది వుంటారు. పనిచేస్తూన్న వారు 20,03,891 కాబట్టి పైన వివరించినట్లుగా పూర్తిగాగాని, కొంతవరకుగాని ఏవిధంగా నైతేమి పనిచేయగలిగి, పని లేనివారు 14.49,109 మంది. అంటే షుమారు $14\frac{1}{2}$ లక్షలమంది పని చేయగలిగి పనిలేక నిరుద్యోగులుగా నుంటున్నారు.

ఈ విషయములో కేంద్ర ప్రభుత్వంచే నియమించబడిన వ్యవసాయ కార్మికుల పరిస్థితులపై విచారణ కమిటీవారి రిపోర్టులో యిలా వున్నది. వ్యవసాయ కార్మికులకు సంవత్సరములో షుమారు 6 నెలలు మాత్రము పని లభిస్తుందని చెప్పారు.

దీనినిబట్టి చూచినను మొత్తము పనిచేయగల $34\frac{1}{2}$ లక్షల వ్యవసాయ కార్మికులకు సగము రోజులు మాత్రము పని లభిస్తున్నది. వారికి తతిమ్మా సగము రోజులూ పనిలేదు. అందులో సగము మందికి సంవత్సరములో పూర్తిరోజులు పని లభించినదని అనుకున్న తక్కిన సగము మందికి అనగా 17 లక్షల మందికి ఏమీ పని లేనట్లే

ఏమైనప్పటికీ షుమారు 14 లక్షల మందికి ఏమీ పని లభించటములేదని చెప్పవచ్చును. మొత్తము వ్యవసాయ కార్మికులను చూచినప్పుడు, కొంతమందికి పూర్తిరోజులు పని లభించినా, మిగిలి

కొంతమందికి కొన్ని రోజులు లభించినా, సగంమందివరకు నిరుద్యోగులుగా నుంటున్నారు.

ఈ లెక్కలు 1951 జనాభా ననుసరించి తయారుచేసినవి. '61 నాటికి జనాభా 25 శాతము పెరుగుతుంది. దీని ప్రకారము ఇంకా 8½ లక్షల వరకు పని చేయతగినవారు రంగములోకి వస్తారు. "ఇంతకుముందే పనిలేనివారు 14 లక్షలు, క్రొత్తగా జనాభా పెరుగుదలవలన వచ్చే 8½ లక్షలు మొత్తము 22½ లక్షలమంది 9 సంవత్సరాల కాలములో నిరుద్యోగులుగా వున్నారు. అయితే రెండోవైపున రెండు ప్రణాళికల ద్వారా అదనపు పనులు కల్పించుట ద్వారా వీరిలో కొంతమందికి పని చూపించబడవచ్చును. అయితే మన రాష్ట్ర ములో రెండవ ప్రణాళికలో అన్నిరకాల ఉద్యోగాలు మొత్తము 5 – 6 లక్షల వరకు మాత్రము చూపించగలమని అంచనా వేశారు. ఆ అంచనా ప్రకారము చూపించగలిగినా నిరుద్యోగ పరిస్థితిని గమనించినప్పుడు, జనాభా పెరుగుదలవలన ఇంకా రోజూ తయారవుతున్న క్రొత్త నిరుద్యోగులను లెక్కలోకి తీసుకున్నప్పుడు, ఈ సమస్యను ప్రణాళిక జయప్రదంగా పరిష్కరించలేదనే చెప్పాలి. బంజరుభూములు ఈ 10 సంవత్సరాల కాలములో 7,8 లక్షల ఎకరములవరకు పట్టాలు యివ్వబడ్డాయి. అందువలన ఈ బంజరుభూమికూడా ఇంతవరకు కౌలుచేస్తూ, కొద్దిగానైనా వ్యవసాయమున్నవారికే ప్రధాన భాగము పోతుంది. పూర్తి వ్యవసాయ కార్మికులకుకూడా కొంత చెందుతుంది. అలా చెందినభూమి కొద్దిగానే వుంటుంది.

నిరుద్యోగులను, యిదేవిధంగా ఇతర వర్గాలలోను ఈ లెక్కల పద్ధతిని నిర్ణయాలకు సాధ్యముకాదు. వ్యవసాయ కార్మికులకు సంబంధించికూడా అనేక ఇతర వాస్తవిక పరిస్థితులను కూడా దృష్టిలో వుంచుకొని చూడాల్సివున్నది. దీనినిబట్టి లెక్కల పరిస్థితి ఎలావున్నా దేశములో నిరుద్యోగతీవ్రత వున్నది. జనాభా పెరుగుదలతో ఇంకా ఈ సమస్య తీవ్రతరమవుతున్నది. ఈనాటి ప్రణాళికా పద్ధతి కొంతవరకు – ఎంత తక్కువైనాసరే ఉద్యోగావకాశాలన

కల్పించవచ్చును. కాని ప్రస్తుతము నిరుద్యోగసమస్య ఈ పద్ధతిలో పరిష్కరించుట సాధ్యముగాదు.

ఉదాహరణకు నిజమైన భూసంస్కరణలద్వారా చాలావరకు వ్యవసాయ కార్మికులకు పని చూపవచ్చును. కాని మన రాష్ట్రంలో తయారైన చట్టముద్వారా ఒక్కరికికూడా భూమి లభించదు. అందు వలన మన ఆర్థికపరిస్థితులలో ప్రాథమికమైన మార్పురానిది వీటిని పూర్తిగా పరిష్కరించుట కష్టము.

# 9. జాతీయాదాయము - ప్రజల జీవన ప్రమాణము

ద్వితీయ ప్రణాళికలో ఈ విషయమై యీ క్రిందివిధంగా చెప్పారు :

1. ప్రజల జీవన ప్రమాణములను పెంపొందింప జేయుటకు జాతీయాదాయమునందు తగినంత పెరుగుదల సాధించుట.

2. ప్రజల ఆదాయము, సంపదలందుగల వ్యత్యాసములను తగ్గించి ఆర్థికశక్తిని సమానముగా పంచిపెట్టుట.

ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానములో జాతీయాదాయము క్రమబద్ధంగా పెరగాలి. దానితోపాటు ఏ ఒక్క వర్గము యొక్క ఆదాయమో పెరుగుటకాక, ప్రజలందరి ఆదాయము పెరగాలి. అంతే గాక ఇంతవరకు దేశములో సంపదలందుగల వ్యత్యాసములను తగ్గించి ఆర్థికశక్తిని సమానముగా పంచిపెట్టాలని ప్రణాళికాశయము లలో నిర్వచించారు. కాని ద్వితియ ప్రణాళికాకాలములో మన రాష్ట్రములో ఎంతవరకు అమలు జరిగాయో చూద్దాము.

ద్వితీయ ప్రణాళికా కాలము 1958 – 59 వరకు వివిధ రంగా లలో మన రాష్ట్ర ఆదాయం ఈ క్రింది పట్టికలో యివ్వబడినది. ద్వితీయ ప్రణాళికా కాలంలో పెంపొందిన జాతీయ ఆదాయమును లెక్కగట్టవలయునన్న 1955 – 56 సంవత్సరము మొదటి ప్రణాళిక చివరి సంవత్సరము ఆదాయముతో పోల్చిచూడవలయును.

# ఆంధ్రప్రదేశ్ యొక్క ఆదాయము, 1952-53 మొదలు 1958-59 వరకు

[తాత్కాలికము] [కోట్లరూపాయలలో]

| | | 1952_53 | 1953_54 | 1954_55 | 1955_56 | 1956_57 | 1957_58 | 1958_59 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | వ్యవసాయము | 469.80 | 515.37 | 454.52 | 444.68 | 537.71 | 577.66 | 646.79 |
| 2. | పరిశ్రమలు | 71.09 | 78.38 | 75.38 | 94.09 | 88.95 | 90.18 | 96.51 |
| 3. | వ్యాపార, రవాణా, రహదారులు | 121.90 | 129.96 | 134.90 | 137.52 | 150.85 | 157.75 | 166.08 |
| 4. | ఇతర వృత్తులవలన | 121.69 | 119.68 | 126.11 | 152.14 | 151.08 | 159.58 | 65.60 |
| | ప్రస్తుత ధరల ప్రకారం మొత్తం రాష్ట్ర ఆదాయం | 784.48 | 873.39 | 790.91 | 828.43 | 928.59 | 985.·7 | 1074.98 |

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ప్రస్తుత ధరల ప్రకారం మొత్తం రాష్ట్ర ఆదాయం | 784.48 | 873.39 | 790.91 | 828.43 | 928.59 | 985.17 | 1074.98 |
| 2. | ప్రస్తుత ధరల ప్రకారం ప్రతి మనిషి సగటు ఆదాయము (రూపాయలలో) | 246.62 | 270.99 | 242.24 | 251.41 | 277 03 | 297.09 | 312.40 |
| 3. | *స్థిరమైన ధరల ప్రకారం రాష్ట్ర మొత్తం ఆదాయము | 784.49 | 855.92 | 806.73 | 919.56 | 919.30 | 926.06 | 988.98 |
| 4. | స్థిరమైన ధరల ప్రకారం ప్రతిమనిషి సగటు ఆదాయము (రూపాయలలో) | 246.62 | 265.57 | 247.08 | 277.95 | 274.26 | 273.24 | 287.41 |

*స్థిరమైన ధరల ప్రకారము అంటె 1952–53 సంవత్సరములోనున్న ధరల ప్రకారము

[అర్థగణాంక శాఖవారిచే ప్రకటించబడిన జాతీయాదాయం అనే పుస్తకంనుండి]

మొత్తం రాష్ట్ర ఆదాయము 1955 – 56 లో

(i) ప్రస్తుత ధరల ప్రకారము రు 928.43 కోట్లు

(ii) స్థిరమైన ధరల ప్రకారం (1952 – 53 ధరల ప్రకారం) రు 919.56 కోట్లు. 1958 – 59 క్రమముగా రు 1074.98 కోట్లు, రు 988.98 కోట్లు.

దీని ప్రకారం ద్వితీయ ప్రణాళికాకాలము 3 సంవత్సరాలలో ప్రస్తుత ధరల ప్రకారం 29.8% మరియు స్థిరమైన ధరల ప్రకారం 7.8% మన జాతీయ ఆదాయం పెరిగినది. మన ఆదాయమును లెక్క గట్టునపుడు ధరల పెరుగుదలనుబట్టి వచ్చిన పెరుగుదల లెక్కలోకి తీసుకోకూడదు. కాన స్థిరమైన ధరల ప్రకారము పెరిగినదే నిజమైన లెక్క. దీనినిబట్టి మూడు సంవత్సరాలలో మన జాతీయాదాయము 7.8% పెరిగినది. ప్రణాళికా లెక్కల ప్రకారం ద్వితీయ ప్రణాళికా కాలము 5 సంవత్సరములలో 25% పెరగవలసియున్నది. సరాసరి ప్రతి సంవత్సరము 5% పెరగవలసి యున్నది. కాని గత మూడు సంవత్సరాలలో 7.8% అంటే సరాసరి సంవత్సరమునకు 2.6% మాత్రమే పెరిగినది. అంటే ప్లాను ప్రకారం ఆశించినదానిలో సగము మాత్రమే సాధించ బడినది.

మన రాష్ట్ర ఆదాయములో ప్రధాన భాగము వ్యవసాయము నుండి వచ్చునదే. వ్యవసాయం ద్వారా 53.7% నుండి 62.4% వరకు వచ్చినది. పరిశ్రమల ద్వారా 8.9% నుండి 11.4% వరకు మాత్రము వచ్చినది.

మన జాతియాదాయం తగినంత పెరుగుదల కాలేదని పైన చూశాము. కాని పెరిగినంతలోనైనా సాధారణ కష్టజీవులకేమైనా చెందినదా? మరియు ప్రస్తుతమున్న సంపదలలో వ్యత్యాసము ఏమైనా తగ్గినదా? కనీసము అందుకేమైనా ప్రయత్నమున్నదా అనే విషయాన్ని చూద్దాము.

ఈ కాలములో కార్మికులు, వ్యవసాయకార్మికులు, చేతి వృత్తులవారు, చిన్న ఉద్యోగములుచేసి జీవించువారు (మధ్యతరగతి ప్రజలు) సాధారణ రైతాంగము – వీరి ఆదాయాల్లో ఏమాత్రము

అభివృద్ధిపొందినదీ నిజంగా ప్రణాళికవలన వీరి జీవితపరిస్థితులు ఎంత వరకు మెరుగైనది మనము చూడాల్సివున్నది.

క్రిందయిచ్చిన పట్టికలలో వివిధ వృత్తులలో వారి సంపాదన యివ్వబడినది. ప్రణాళికాకాలము పెరుగుదల లేదా తరుగుదల ఇవ్వబడినది.

## పారిశ్రామిక కార్మికుని సంవత్సరపు సగటు జీతము

| పరిశ్రమ పేరు | 1954 రూ. | 1955 రూ. | 1956 రూ. | 1957 రూ. | 1955 నుండి పెరిగినశాతం |
|---|---|---|---|---|---|
| పంచదార | 843 | 856 | 1.013 | 1,006 | 17.5 % |
| జౌళి పరిశ్రమ | 791 | 919 | 959 | 898 | 8.6 % |
| జనపనార | 724 | 934 | 1,030 | 1 032 | 14.3 % |
| ధాన్యం మిల్లులు | — | — | 379 | 364 | — |
| పింగాణి పరిశ్రమ | 613 | 628 | 586 | 656 | 4.5 % |
| వనస్పతి | — | — | 413 | 411 | — |
| రసాయనిక పరిశ్రమ | 1,187 | 1,174 | 1,216 | 1 223 | 13.9 % |
| జనరల్ ఇంజనీరింగ్ | — | — | 9 6 | 1,066 | — |

(ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికోత్పత్తి సెన్సస్ 1956-57)

## రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల నెలమొత్తము జీతాలు

| తరగతి | 1952 రూ. | 1958 రూ. | 1959 రూ. | 1952 సం॥ కంటె 1959లో పెరుగుదల శాతం |
|---|---|---|---|---|
| ఫ్యూన్ | 41 | 47 | 56 | 36.6 % |
| అటెండరు | 48 | 54 | 62 | 29.1 % |
| లోయర్ డివిజన్ గుమాస్తా | 76 | 82 | 85 | 11.8 % |
| అప్పర్ డివిజన్ గుమాస్తా | 111 | 113 | 126 | 13.5 % |
| సూపరింటెండెంటు | 185 | 191 | 190 | 2.7 % |

## చిన్న పరిశ్రమలలో పనిచేయు ఒక్కొక్కరి సంవత్సర సగటు ఆదాయం

(రూపాయలలో)

| | 1952–53 | 1953–54 | 1954–55 | 1955–56 | 1956–57 | 1957–58 | 1958–59 | 1955–56 కంటె 1958–59 లో పెరుగుదల–తరుగుదల (+) (—) |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. చిన్నతరహా బట్టల పరిశ్రమలు మరియు దర్జీ పనివారలు | 386 | 409 | 386 | 445 | 397 | 420 | 428 | — 17 |
| 2. చర్మకార పరిశ్రమ | 430 | 456 | 430 | 512 | 443 | 468 | 477 | — 35 |
| 3. కలప, గ్లాసు, పింగాణీ, గృహనిర్మాణ పనులు | 421 | 446 | 421 | 477 | 433 | 459 | 467 | — 10 |
| 4. లోహములు, ఇంజనీరింగు పనులు | 408 | 433 | 408 | 450 | 420 | 445 | 453 | + 3 |
| 5. రసాయనికములు | 437 | 463 | 437 | 540 | 459 | 476 | 485 | — 55 |
| 6. ఆహారపానీయములు, పొగాకు పనులు | 315 | 334 | 315 | 525 | 325 | 344 | 350 | —175 |
| 7. ఇతరములు | 345 | 366 | 345 | 343 | 355 | 376 | 383 | + 40 |

[జాతీయాదాయం ప సరం నుండి]

వ్యవసాయ కార్మికుల దినసరి కూలికి సంబంధించి సరైన లెక్కలు లభించనందున లెక్కలు యివ్వలేదు. కాని ఆంధ్రప్రదేశ్ గెజెట్టులో ప్రకటించిన దానినిబట్టి 1959 సెప్టెంబరులో జిల్లాలలో సరాసరి పురుషునికి రు 1=27, స్త్రీకి రు 0 = 88, 1960 మేలో జిల్లాలలో సరాసరి పురుషునకు రు 1 = 30 స్త్రీకి రు 0 = 89 లు యిస్తున్నట్లు ప్రకటించారు. 59 కంటె 60 లో పురుషునకు 3 నయాపైసలు, స్త్రీకి 1 నయాపైసా పెరిగినట్లు చూపబడినది. రెండు సంవత్సరములలో వేర్వేరు నెలల లెక్కలుగాని నిజంగా ఎంత పెరిగినదీ సరిగా తెలదు. ఏమైనా అప్పుడప్పుడు పనుల వొత్తిడినిబట్టి షుమారు 30 న.పైసలు మొదలు రు 40 న.పైసలవరకు పెరగవచ్చును. ముఖ్యముగా సీజన్సుమీద, పని ఒత్తిడినిబట్టి ఆధారపడి వుంటుంది. కాని వ్యవసాయ కార్మికులలోనున్న నిరుద్యోగ తీవ్రతనుబట్టి పని చాలా కొద్దిరోజులే దొరుకుతున్నది. పైగా నిరుద్యోగుల సంఖ్య జాస్తి గావటమువలన పని ఒత్తిడికూడా తగ్గిపోతున్నది.

అదేవిధముగా పారిశ్రామిక కార్మికులకు వివిధ పరిశ్రమలలో 4.5% మొదలు 17.5% వరకు నెలసరి జీతాలు పెరిగాయి. పంచదార, రసాయనిక పరిశ్రమలలో మాత్రము 17.5%, 13.9% వరకు పెరిగాయి. తక్కిన వాటిలో 8.6% కు మించలేదు.

రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకు మొదటి ప్రణాళికాకాలమునుంచి రెండవ ప్రణాళిక ఆఖరువరకు 10 సంవత్సరాలకాలములోరెండుసార్లు పెంచారు. ప్యూన్లు అటెండర్సుకు మాత్రము కొంతవరకుపెరిగినది. అసలు మొదటువారికి చెల్లించేది అతి స్వల్పమైన మొత్తము. లోయరు డివిజను గుమాస్తాకు 11.8%, అప్పర్ డివిజన్ గుమాస్తాకు 13.5 %, సూపరింటెండెంటుకు 2.7% మాత్రము పెరిగాయి. జాతీయాదాయము 25% పెరగాలన్నారు. కాని వీరికి పెరిగిన మొత్తాలు అతి స్వల్పము.

ఉపాధ్యాయులకు కూడా సరాసరి షుమారు రు 10=00 పెరిగి వుండవచ్చు. ఇది స్వల్పమని వేరే చెప్పనక్కరలేదు.

ఇక చిన్నతరహా పరిశ్రమలవారి సంవత్సర సగటు ఆదాయము ప్రణాళికాకాలములో పడిపోయింది. లోహము. ఇతరముల క్రింద తప్ప తక్కిన వాటిలో సంవత్సర సగటు ఆదాయము పడిపోయింది. సంవత్సరం మొత్తములో పనులు లేకపోవటము, సరుకు అమ్ముడు పోక పోవడమువలన వారి ఆదాయాలు పడి పోతున్నాయి.

కాని ఆదాయాన్ని చూపెటప్పుడు జీవితావసర వస్తువుల ధరలు నిలకడగా ఉన్నాయా లేక పెరిగాయా పెరిగితే ఎంతశాతము అన్న విషయాన్ని సమగ్రంగా పరిశీలించినప్పుడే నిజంగా ఆదాయాలు పెరిగాయా లేదా అని తెలుస్తుంది. జీతాలు కొంత పెరిగినా మరొకవైపు జీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగినప్పుడు. ఆదాయాల్లో క్రొత్తగా పెరిగినది ఆచరణలోకి రాకుండా నిజమైన వేతనాలు పడిపోతాయి. ఈ క్రింది పట్టికను చూచిన 1948 – 49 నుండి వివిధ జీవితావసర వస్తువుల ధరలు ఎలా పెరిగాయో తెలుస్తోంది. 1955 – 56 నుండి రెండవ ప్రణాళికాకాలములోఎంత శాతము పెరిగాయో చూపబడినది.

ముఖ్యమైన ధాన్యము (వడ్లు) మొదటి, రెండవరకము 43.65%, బియ్యము 49.51%, సజ్జలు 56.34%, జొన్నలు 79.64%, పెసలు 59.48%, కందులు 48.26%, వేరుశనగ 71.77%, చింతపండు 152.72%, దూది 96.67% వరకు పెరిగాయి. ఇవన్నీ టోకుధరలమీద ఆధారపడి చూపినవి. చిల్లరగా జీవితావసర వస్తువులు షుమారు 50% వరకు పెరిగాయి.

పూర్వమున్న జీవిత ప్రమాణము నిలబెట్టుకోవాలన్నా వారి వారి ఆదాయాల్లో 50% పెరగాలి. కాని యింతవరకు వారి వారి ఆదాయాలలో పెరుగుదల ధరల పెరుగుదలను ఏ మాత్రము అందుకోలేకుండా వున్నది. ధరల పెరుగుదలను అదుపులో పెట్టనందువలన పేదప్రజల జీవిత ప్రమాణము తగ్గినది.

కాన జాతీయాదాయము పెరుగుదల అన్నప్పుడు ఇవన్నీ చూడాలి.

జాతీయాదాయము యింతకుముందే చూపినట్లు కొంత పెరిగినది. దేశములోనున్న పెద్ద పెట్టుబడిదార్లు, కంట్రాక్టర్లు, భూస్వాముల ఆదాయాలు బాగా పెరిగినవి.

సాధారణంగా చిన్న రైతాంగము పరిస్థితికూడా మెరుగు కాలేదు.

'ప్రజల ఆదాయము, సంపదలందుగల వ్యత్యాసములను తగ్గించి ఆర్థిక శక్తిని సమానంగా పంచిపెట్టుటకు' అన్న సూత్రము కేవలము నినాదంగా మాత్రమే వున్నది.

## ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమైన ఆహార వస్తువుల యొక్క టోకుధరలు

(స్టాండర్డు మణుగు($82\frac{2}{7}$ పౌండ్లు) ధరలు రూపాయలలో)

| వరుస సెం. | వస్తువు | 1948–49 జూలై నుండి జూన్ వరకు | 1949–50 | 1950–51 | 1951–52 | 1952–53 |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 1. | ధాన్యము (1,2 రకాల సగటు) | 9.54 | 9.05 | 8.70 | 8.98 | 10.29 |
| 2. | బియ్యం 2 వ రకం | 15.20 | 13.46 | 13.39 | 15.61 | 17.85 |
| 3. | సజ్జలు | 8.80 | 8.44 | 9.15 | 9.22 | 9.41 |
| 4. | జొన్నలు | 9.32 | 9.94 | 9.67 | 10.45 | 10.85 |
| 5. | పెసలు | — | — | — | — | — |
| 6. | కందులు | — | — | 13.76 | 12.19 | 12.75 |
| 7. | వేరుసెనగ (కాయ) | 16.64 | 20.48 | 23.44 | 19.41 | 19.25 |
| 8. | చెరుకు (చెరుకుబెల్లము) | 12.19 | 22.15 | 24.44 | 13.67 | 14.30 |
| 9. | ఆముదాలు | 24 15 | 20.42 | 28.20 | 25.95 | 20.91 |
| 10. | చింతపండు | 14.20 | 31.06 | 33.05 | 16.79 | 20.04 |
| 11. | దూది | 64.55 | 73.87 | 81.30 | 70.44 | 57.88 |
| 12. | పొగాకు | 54.09 | 52.56 | 50.28 | 64.82 | 71.71 |

| 1953_54 | 1954_55 | 1955_56 | 1956_57 | 1957_58 | 1958_59 | సెప్టెంబరు 1959 | 1960 ఆగస్టు | 1955_56 మీద 1960 ఆగస్టు పెరుగుదల శాతం |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | | |
| 10.73 | 9.07 | 10.77 | 13.16 | 12.90 | 13.50 | 15.03 | 15.48 | 43.65 |
| 17.23 | 14.31 | 15.37 | 19.36 | 19.36 | 20.18 | 22.82 | 22.98 | 49.51 |
| 11.48 | 9.59 | 8.75 | 11.22 | 11.48 | 11.85 | 12.71 | 13.68 | 56.34 |
| 11.19 | 7.87 | 8.40 | 12.86 | 12.64 | 12.67 | 15.09 | 15.79 | 79.64 |
| 13.59 | 8.89 | 12.81 | 14.56 | 16.12 | 21.37 | 18.88 | 20.43 | 59.48 |
| 9.12 | 7.89 | 11.23 | 12.71 | 13.23 | 18.50 | 16.77 | 16.64 | 48.26 |
| 20.00 | 20.03 | 14.45 | 17.91 | 18.22 | 19.89 | 21.00 | 24.82 | 71.77 |
| 17.21 | 11.28 | 9.76 | 12.41 | 13.22 | 17.49 | 22.97 | 21.47 | 119.97 |
| 17.07 | 11.11 | 13.72 | 21.02 | 2 .79 | 21.55 | 23.32 | 24.13 | 75.90 |
| 36.59 | 22.87 | 13.60 | 14.60 | 12.96 | 21.40 | 57 12 | 34.37 | 152.72 |
| 57.83 | 56.85 | 49.66 | 71.24 | 61.8 | 68.621 | 76.75 | 57.62 | 96.67 |
| — | 61.87 | 70.81 | 64.20 | 66.23 | 61.59 | 63.55 | 73.26 | 3.45 |

ఆంధ్రప్రదేశ్ అర్థ గణాంకశాఖవారి లెక్కల ప్రకారం

## ముగింపు

ఆంధ్రప్రదేశ్‌లో ద్వితీయ ప్రణాళిక ఏ విధంగా అమలు జరుప బడినదీ, ఎంతవరకు టార్గెట్స్ సాధించబడ్డాయో చూశారు.

మన రాష్ట్రములో త్వరితగతిని ఆర్థికాభివృద్ధి చెందుటకు ప్రజలందరికీ పని, తిండి, బట్ట లభించుటకు ఈ ప్రభుత్వ విధానాలు సరైనవికావని మనకు ఋజువవుతుంది.

ఈ విషయాన్ని కమ్యూనిస్టుపార్టీ మొదటినుంచీ చెప్తూనే యున్నది.

మన దేశ ఆర్థిక విధానాలకు సంబంధించిన స్పష్టమయిన కార్యక్రమాన్ని ప్రజలముందుంచినది.

ఈ విషయాలన్నిటినీ సహృదయులైన దేశభక్తులందరూ ఆలోచించగలరని విశ్వసిస్తున్నాను.

